

# జగద్గురు విలాసం


బాడాల రామయ్య

గ్రంథకర్త

# JAGADGURU VILASAM

Published by :
**BĀDALA RAMAIAH,** M.A., D.Lit
with the financial Assistance by
**T.T.D.,Tirupathi**
and
Friends.

First Edition :**1998**



No. Copies : 1,000

Price : Rs. **70–00**

Computer type setting, Designing
and Printing by **VIJAYAVANI PRINTERS,**
**CHOWDEPALLE–517 257,** Chittoor Dt. (A.P.)
Phones : 08581–56234, 56213, 56239.



స్వామి! నీ వడ్డికాసుల వైభవమున
గురువిలాస మీ భూమిపై వెలుగుచూచె
నాస్తికుల గుండెల గుడి గంటలుగ మ్రోగె
ఆర్షధర్మము దశదిశా వ్యాప్తిచెందె.

श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम्, दक्षिणाम्नाय श्री शारदापीठम्, श्रृङ्गेरी



Ref. No. . D-1-16,808
Camp . శృంగేరి
Date : 29-11-1997



జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థస్వామి

పరశివావతార స్వరూపులైన శ్రీమచ్ఛంకర భగవత్పాదులవారి పవిత్ర చరిత్రము సర్వశ్రేయః ప్రదము, సర్వ పాపాపనోదకమునై విలసిల్లుచున్నది.

అందువలననే రామకధను ఎందరో కవులు పలుభంగుల వర్ణించి తమ జిహ్వాను సార్థకమొనర్చుకొనినట్లు శ్రీ శంకరుల చరితమును గూడా అనేకులు వర్ణించి తమ వాక్కును పరిశుద్ధ మొనరించుకొనినారు.

అదేవిధముగా శ్రీయుతులు బాడాల రామయ్యగారు "జగద్గురు విలాసం" అను పేరుతో శ్రీ శంకరుల చరిత్రను వర్ణించి ధన్యులయినారు. వారీ గ్రంథమును శ్రీ జగద్గురువుల సన్నిధిలో వినిపించి శ్రీ చరణుల నానందింప జేసినారు.

ఈ గ్రంథము ఇప్పుడు ముద్రితమగుట ముదావహము. ఇది ఆస్తికలోకమును రంజింప చేయుగాక, ఈ గ్రంథకర్త శ్రీ శంకరుల విశేషకృపాభాజనులగుదురుగాక యనియు శ్రీచరణులు నారాయణ స్మరణ పూర్వకముగా నాశీర్వదించినారు.

ఇట్లు

(భారతీయ తీర్థస్వామి)




SRIMANNARAYANA RAMANUJA YATHIBHYONAMAHA

**JEEYAR EDUCATIONAL TRUST**

Founder and managing Trustee His Holiness
Sri Sri Tridandi Srimannarayana Ramanuja
**Chinna Jeeyar Swamy.**



శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చినజియర్‌స్వామి

ప్రియ శ్రీమాన్ రామయ్యగారు!
శ్రీమతే నారాయణాయ నమః
అనేకమంగళాశాసనములు!

మీ లేఖ చేరింది. ఆదిశంకరుల జీవిత చరితను తెలుగు జిజ్ఞాసువులకు అందించే కవితా వైభవాన్ని పొందిన మిమ్ము ముందుగా మంగళాశాసనములు చేస్తున్నాం.

విలక్షణమైన నాల్కతో క్షుద్ర కీర్తనలు మాని దివ్య కృత్యములు చేయగలగడం ఓ అదృష్టము. విశేషం.

అందునా వేదధర్మ పరిరక్షణకావించిన ఆచార్య పరం పరలో ఈ కాలానికి ఆద్యులు, మార్గ దర్శకులు అయిన ఆదిశంకరులను గురించిన మీ కవితా వైజయిన్తి వర్ధతామభి వర్ధతామ్మని మంగళాశాసనములు చేస్తున్నాం.

-జై శ్రీమన్నారాయణ-

ఇట్లు

(చిన్న జియర్‌స్వామి)



॥ ಶ್ರೀ ಗೋಪೀನಾಥೋ ವಿಜಯತೇ ॥

ಶ್ರೀಮತ್ಪರಮಹಂಸ ಪರಿವ್ರಾಜಕಾಚಾರ್ಯೇತ್ಯಾದ್ಯನೇಕ ಗುಣಸಂಪನ್ನ ಪದವಾಕ್ಯಪ್ರಮಾಣ ಪಾರಾವಾರಪಾರೀಣ
ಸರ್ವತಂತ್ರಸ್ವತಂತ್ರ ಶ್ರೀಮದ್ವೈಷ್ಣವಸಿದ್ಧಾಂತಪ್ರತಿಷ್ಠಾಪನಾಚಾರ್ಯ ಶ್ರೀಹಯವದನರಂಗವಿಠಲಾತ್ಮಕ
ಶ್ರೀಗೋಪೀನಾಥದಿವ್ಯಶ್ರೀಪಾದಪದ್ಮಾರಾಧಕರಾದ ಶ್ರೀ ಶ್ರೀಪಾದರಾಜ ವರವಿದ್ಯಾಸಿಂಹಾಸನಾಧೀಶ್ವರ

**ಶ್ರೀ 108 ಶ್ರೀ ಸತ್ಯನಿಧಿತೀರ್ಥ ಶ್ರೀಪಾದಂಗಳವರ ವರಕುಮಾರರಾದ**

**ಶ್ರೀ 108 ಶ್ರೀ ವಿಜಯನಿಧಿತೀರ್ಥ ಶ್ರೀಪಾದಂಗಳವರ ಕರಕಮಲ ಸಂಜಾತರಾದ**

## ಶ್ರೀ 108 ಶ್ರೀ ವಿಜ್ಞಾನನಿಧಿತೀರ್ಥ ಶ್ರೀಪಾದಂಗಳವರು



(శ్రీ విజ్ఞాననిధి తీర్థస్వామి)

శ్రీ ఆచార్య రామయ్య వ్రాసుకొన్న జగద్గురు విలాసమునకు నారాయణ స్మరణ పూర్వకముగ వ్రాయించి యిచ్చిన ఆశీస్సందేశము.

ఆచార్య రామయ్యగారు స్వయముగ వచ్చి తమ కృతిలోని కొన్ని ముఖ్య ఘంట్టములు చదివి మాకు మహదానందము చేకూర్చిరి.

ప్రతి వ్యక్తికి భగవత్ప్రసాదితమైన ఒక శక్తి గలదు. దానిని భగవదర్పణ బుద్ధితోనుపయోగించిన జగత్కల్యాణము కాగలదు. రామయ్యలో విశిష్టమైన కవితాశక్తి కలదు. ఇతని భాష సరళము. భావముదాత్తము. వస్తువు లోకోత్తరము. తీర్చి దిద్దిన శిల్పమమోఘము. శంకరులుపయోగించిన శబ్దములేకాక అతని శ్లోకములెన్నో ఈ కృతిలో పద్యములైనవి. శంకరాచార్యుల భావములనేకములు ఇట మతత్రయమునకు సమ్మతము. ఇట్టి రచనలు నేడత్యవసరము. నేడు మనము పాటించే భారత సంవిధానమందలి జాత్యతీత సిద్ధాంతము, ఏకాత్మవాదము, ఉపనిషత్ప్రతిపాద్యమని శంకరులు సూచించినట్లు రామయ్యగారు ప్రార్థనా సందర్భమున తెలిపిరి. ఇది ముదావహము.

నాటి కాలమే శంకరాద్వైతమునకు కారణము. ఆనాడు మానవజాతి నాస్తిక భూయిష్టమై శాంతి లేక సతమతమగుచుండగ శాంకర దర్శనము దప్పిగొన్న ఎడారి

తెరువరికమృతమబ్బినట్లు తోడ్పడినది. బుద్ధుని మానవతావాదము నశించి, శుష్కతార్కికము విజృంభించెను జీవితము యాంత్రికమై, బ్రతుకే శూన్యమని, లోకమే క్షణికమని, నిరాశకంకితమైపోయిన జాతికి శూన్యము పూర్ణమని, క్షణికమగు మిథ్యాలోకమునకధిష్ఠానము బ్రహ్మమేయని శంకరులు చాటిరి. ఈ సత్యము నెరుంగక పరులు (భాస్కరయాదవాదులు) ఇతనిని ప్రచ్ఛన్న బౌద్ధుడనిరి. కానీ శంకరుల భావమునే నేటిశాస్త్రజ్ఞులు ప్రాయోగికముగ ఋజువు చేసిరి.

*" There is really something in nothing. Physicists have known for most of the 20th Century that emptiness is really kind of full. The vacuum, as Physicists call it, is full of partices that pop into existence for such short periods of time that they can't be detected directly." 2 Physics, Science Express, Tuesday 6th May, 1997.* ఈ తాత్విక సత్యము శంకరునిలో కలదని రామయ్యగారు మొట్టమొదట మనకెత్తి చూపిరి. (చూ.పుట-1. 156. జ.గు.వి.) ఇటులనే ఈ కృతిని సూక్ష్మదృష్టితో చూచిన ఇట్టి వైజ్ఞానిక సత్యములెన్నో ఇంకనూ బయల్పడ గలవని మా నమ్మకము. ఉత్తమ కవిత తత్త్వమునకు, శాస్త్రమునకు విరుద్ధము కాదు. ఇట్టి సమన్వయాత్మకరచనలే నేడు మార్గదర్శకములు. మానవుని బుద్ధి నేడు పెడదారి బట్టినది. ఈ బౌద్ధమున బ్రహ్మాండము పిచ్చుక గూడైనది. అణువులు విచ్ఛిన్నమైనవి. ప్రళయమే పైబడుచున్నది. మానవుని విపరీత స్వార్థశక్తులు హిరణ్యకశ్యపునివలె విజృంభించుచున్నవి.

ఈ అస్తవ్యస్త జగత్తు నశింప, ప్రహ్లాదుని వైష్ణవ భక్తి ప్రదీపింప, ఉపనిషత్ప్రతిపాద్య బ్రహ్మతత్త్వము నిరూపించిన శంకరాచార్యులు నాడే కాదు నేటికిని మార్గదర్శకులై పూజనీయుడనుటలో సందేహము లేదు. ఆ మహాపురుషుని స్తుతించిన కవి ధన్యుడు. ఈ కృతిస్మరణార్హము.

ఆచార్య బాడాల రామయ్యగారికి అనంతానంత ఆయురారోగ్య భాగ్యములనిచ్చి, ఇట్టి రచనలు మరికొన్ని చేయునట్లు అస్మద్గుర్వంతర్గత భారతీరమణ ముఖ్య ప్రాణాంతర్గత శ్రీ హయవదన రంగ విఠలాత్మక శ్రీ గోపీనాథస్వామి వారిని ప్రార్థించుచున్నాము.

ఇట్లు

(శ్రీ విజ్ఞాననిధి తీర్థస్వామి)

బెంగళూరు.
8-1-98.

శ్రీ గణపతి సచ్చిదానంద అవధూత దత్తపీఠమ్
శ్రీ గణపతి సచ్చిదానంద ఆశ్రమము,
దత్తనగరు, ఊటీరోడ్, మైసూరు - 570 004
ఫోను : 0821-486486 ఫాక్స్ : 0821-487487

తేది : 19-12-1997

## అవధూత దత్త పీఠాధిపతి, పరమపూజ్య జగద్గురు శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానందస్వామీజీవారి (ఆశీస్సందేశము)



శ్రీ గణపతిసచ్చిదానందస్వామీ

మహాత్ముల చరిత్రలు సహజంగానే లోకోత్తరమైన సన్ని వేశాలతో నిండి వుండగా, భక్తులైన వారు వాటిని మరింత దివ్యీకరించి ఆనందిస్తూ వుంటారు. ఇట్టి సంద ర్భాలలో జల్లెడ చేతబట్టి యథార్థమగు సన్నివేశాలను విడదీసేవాడు చారిత్రకుడు.

మహాత్ములు, సమకాలీన ఆగామి కాలీన జీవన స్రవంతులను మలుపు తిప్పేందుకు అవతరిస్తారు. అందువల్ల వారి జీవిత సన్నివేశాలకు వెనుక ప్రబలమైన దేవరహస్యం ఆకుమాటుపిందెలాగా దృశ్యాదృశ్యంగా వుంటుంది. ఆ పిందెను ఒడిసి పట్టి, శిలగా చేసుకొని, శిల్పంగా చెక్కి జీవంతంగా జనులముందు నిలబెట్టేవాడు కవి.

బాడాల రామయ్య గారిలో చరిత్రకారుడు, కవి కలినేతగా కలిసిపోయారు. అందువల్లే ఆయన దృష్టిలో, సృష్టిలో, శంకర చరిత్ర "జగద్గురు విలాసము"గా అవతరించింది.

శంకరుణ్ణి మతప్రవక్తగా చిత్రించేవారు చారిత్రకులు కారు; వాదజేతగా వర్ణించేవారు భక్తులు కారు. ఆయన కథను రసమయమని నినదించేవారు కవులుకారు. ఇక యెలా ఆయన కథను త్రవ్విపోసుకోవటం?!

ఇదిగో రామయ్యగారు ఒక కొంగ్రొత్త బాటను సారిస్తున్నారు. ఈ బాటలో అడుగడుగునా సమన్వయ రహస్యాలను వీధి దీపాలుగా అమర్చారాయన. ఇదే కవి సృష్టి. ఈ సృష్టిలో కవికి స్వాతంత్ర్యం వుంది. చారిత్రకుడికి ఇక్కడచోటు లేదు; విరోధం గూడా లేదు. దీనికి మంచి ఉదాహరణం "సుదర్శనం" అనే ఖండికలోని మాతంగ కన్యసన్నివేశం.

శంకరుడు స్థాపించిన పీఠాలెన్ని, రచించిన గ్రంథాలెన్ని, చేసిన శాస్త్రాలెన్ని, అని లెక్కలు వ్రాసుకొనే వారికి శంకర తత్త్వం అందటం దుర్ఘటం. జగత్తును గురువుగా తీసికొని, జగత్తుకే గురువైన జ్ఞానశక్తి శంకరుడు. ఆ స్వామి చరిత్రకు మతవాదాల మత సరిహద్దులను అంటగట్టినా అంటవు. సమన్వయం ఆయన సందేశం. ఆచరణ ఆయన ఆదేశం. ఏకత్వం ఆయన ఉపదేశం.

పైకి కనిపించే మూడు ముఖాలతో దత్తస్వామి బోధించే అంతర్గత సమన్వయశాస్త్రం ఇదే. ఇదే యీనాటి విచ్ఛేదోన్ముఖ మానవజాతికి అందవలసిన అన్నం.

ఈ తత్వాన్ని కవితా హృదయంతో భావించి పులకరించిన రామయ్యగారు తన కవిత్వాన్ని సార్థకం చేసికొన్నారు.

ఇక మిగిలినది పాఠకుల వంతు దత్త కృపవల్ల ఆంధ్ర పాఠకులు ఈ అమృతపాథేయాన్ని ఆత్మలకు అందించు కొందురుగాక.

**జయతుగురుదత్తః**

# అవతారిక

సుమారు మూడేండ్లనాటి మాట గుండెపోటుతో బాధపడుతూ బెంగళూరు మల్యా ఆస్పత్రిలో చేరితిని. నన్ను పరీక్షించి డాక్టర్లు బైపాస్ సర్జరీ చేయవలెనని చెప్పిరి. వారి ఆదేశముల, ఆ పరీక్షా ఫలితాల పట్టికను తీసుకొని మైసూరికి వచ్చి నా స్నేహితుడు ప్రసిద్ధ డాక్టరు పి.ఆర్. సింధేను చూచితిని. ఆయన యీ పరీక్షా ఫలితాల అన్నింటినీ పరిశీలించి ఇప్పుడు బైపాస్ సర్జరీ అనవసరము. మీరు ప్రొద్దుననే లేచి 2 కిలో మీటర్లు నడచే అభ్యాసము చేసుకోండి. వీలయినంత వరకు విశ్రాంతి తీసుకుంటూ, స్థితప్రజ్ఞునివలె ప్రవర్తించండి. అన్నీ సరిపోతుందని ఆదేశించిరి. వారిమాట ప్రకారమే నేటివఱకూ వేకువలో లేచి నడిచే అభ్యాసం చేసుకొంటిని. కాని స్థితప్రజ్ఞుని లక్షణాలు అలవడడం లేదు. ప్రయత్నిస్తున్నాను. విశ్రాంతికై పడకపై దొర్లడం కష్టమని నా లైబ్రరిలోనున్న ఒక పుస్తకము నెత్తికొంటిని. అది శంకరుల చరిత్ర. దానిని చదువుతూ, ఆయన రచనలను తరచడానికి యత్నించితిని. ఆచార్యులవారి ప్రస్థానత్రయము చూచితిని. ఆ మహాత్మునిపై వచ్చిన సంస్కృత ఆంధ్రకర్ణాటాంగ్ల భాషలలో దొరికినంత సాహిత్యాన్ని సేకరించి జీర్ణించుకొన చూచితిని. కాని అతని భాష, భావము, పరమార్థము ఉత్తరోత్తర బలీయమై, కడకునన్ను పిచ్చివానిని చేసివేసెను. అయ్యో! కాలము వృథా అయిపోయెనే! యీ గురుదేవుని ముందే తెలుసుకొనలేకపోతినే? జీవితమే వ్యర్థమైపోవుచున్నదే! యని బాధపడుతూ, భిన్నభిన్న ప్రవృత్తులతో భిన్న భిన్న భాషలతో భిన్న భిన్న ప్రాంతములతో జాతి కుల మత జంజాటములో నలిగిపోయే యీ దేశానికి శంకరుని ఉపదేశమే శరణ్యమని నిశ్చయించుకొంటిని. అంతే నాకు తెలియకనే శంకరుల జీవన స్వరూపమే జగద్గురు విలాసంగా మారిపోయెను.

నా మాతృభాష తెలుగు. నా నివాసము కర్ణాటక దేశము. నా వ తావరణము ప్రాజ్ఞుల సాహచర్యము. అట్టివారిలో సి.డి. నరసింహయ్యగారొకరు. మైసూరు యూనివర్సిటీలో ఆంగ్లభాషా ప్రాచార్యులై ఖండాంతర యశస్సునందుకొన్న సహృదయులు. వారి యీ గుణగణాల పరిశ్రమ ఫలితమే ధ్వన్యాలోకమై మైసూరున ప్రసిద్ధి వహించినది. ఇది అన్ని భాషలవారికి సాహిత్యకేంద్రము. అంతేగాదు భాషాంతర్గతమైన సరస్వతీ హృదయాన్ని ప్రతి ధ్వనింప చేసే ఆనంద నిలయము.

అప్పుడప్పుడీ శారదోపాసకునితో భారత భాగవత రామాయణాదులపై చర్చిస్తూ కాలగతినే మఱచిపోయిన సన్నివేశాలెన్నో! ఒకసారి మాటామాటపై ఆదిశంకరుల చరిత్ర వ్రాయు చుంటినని వారితో అంటిని. అంతే నరసింహయ్యగారు పులకాంకితులై కనులలో ప్రాణముతొనికిసలాడగ, "ఓహో! ఏమి శంకరుడు రామయ్యగారు నేను పాశ్చాత్య దేశాల పర్యటన యందుండగా ఎందరో ప్రాజ్ఞులు, కొమ్ములు తిరిగిన పండితులు తాము శంకరునితో మాట్లాడవలెనని మా జీవితాశయమిదేయని నాతో బల్కిరి. అంతే కాదీ దేశంలో సంచరిస్తు మన సంస్కృతి విషయమై తజ్ఞులతో చర్చించుచుండగా ఎందరో పేద బ్రాహ్మలు శంకరతత్త్వమును ప్రచారము చేయుటయే తమ జీవిత కర్తవ్యమని దృఢముగా వచించిన సందర్భముల మరవలేను. దేశవిదేశాలలో నేటికిని శంకరునికున్న యీ ప్రభావము తలచినంతనే చకితుడనై పోవుచుంటిని. అట్టి ఆచార్యుని గూర్చి వ్రాయు మీ పద్యములు వినవలెని కుతూహలము చూపిరి. ఆ మాటలు విన్నవెంటనే నాకు వేయి యేనుగుల బలము వచ్చెను. కన్నడ దేశంలో నా తెలుగు పద్యాలు వినే వారు కలరు కదాయని ఉరకలతో వారిని చూచితిని.

నరసింహయ్యగారిది యింటిమాట తెలుగే. వారు కన్నడం చదివినా, పాండిత్యము ఆంగ్లభాషయందే. భాషలకు మించిన రసహృదయం వారిది. వారు శంకరుల చరిత్రలోని కొన్ని ఘట్టములు విన్న వెంటనే తనకుమారుడు శ్రీనాధుని పిలిపించెను. శ్రీనాధుడు బెంగళూరు యూనివర్సిటీలో ఆంగ్లభాషయందు ప్రాచార్యుడై యున్నారు. ఆ తండ్రికుమారులిరువురు సంస్కారవంతులే. కవితా హృదయులే. శ్రీనాధుడింగ్లీషులో కొన్ని పద్యములు వ్రాసిరి. అవి కన్నడభాషకు కూడ పరివర్తనమైనవి. ఈ యిరువురు శంకరుల జీవన చరిత్రలోని కొన్ని ఘట్టములు విని ముగ్ధులైపోయిరి. ఇది తప్పక ప్రకటితము కావలెను. ఈ ముద్రణకు కాగల డబ్బు సేకరింతుము. దీనిని ప్రకటించుటకు తగిన యేర్పాట్లుగావింతు[illegible]నిరి.

ఇంతలో గణపతి సచ్చిదానందాశ్రమమునకు కంచి కామ కోటిపీఠాధి పతులు వచ్చిరి. మిత్రుడు సుబ్రమణ్యపండితునితో కలసి స్వాములవారిని దర్శించితిని. తెలుగులో శంకరుల చరిత్ర వ్రాసినాడని సుబ్రమణ్యంగారు నన్ను స్వాములవారికి బరిచయము చేసిరి. వారు ననుజూచి చాల సంతోషించి మీ శంకర విజయం ముద్రిస్తాము కంచికి రండని ఆహ్వానించిరి. వారి మాటమేరకు నేను నా

కుమారుడు శ్రీనివాసునితో కంచికి పోయి స్వాముల వారిని దర్శించితిని వారు మీ శంకర విజయమివ్వండి. ఇక్కడ మా పండితులు చూచిన తరువాత టి.టి.డి వారితో చెప్పి దీన్ని ప్రకటించే ఏర్పాటు చేస్తామనిరి. వారి చెప్పినట్లే శంకరుల చరిత్ర అచ్చట వదలి మైసూరు చేరుకొంటిని. అంత అక్కడ సంస్కృతాంధ్ర పండితులను బిలిపించి వారినీ పుస్తకమును పరిష్కరింపుని స్వాములవారాదేశించిరి. వారు 15 దినములలో పుస్తకము చూచి సంతోషించి ఇందలి కవిత అత్యుత్తమ స్థాయియందున్నది. కానీ చారిత్రక విషయమున కొన్ని సవరణల సూచించుచు పుస్తకమును నాకు బంపిరి. ఆ సవరణల గ్రహించి చాలావరకు మార్చుకొంటిని.

మాయిలవేల్పగు శ్రీమద్వేంకటనాధుని దర్శింప నేను సకుటుంబముగా తిరుపతికి పోతిని. అచ్చట అన్నమాచార్య ప్రాజెక్టు డైరక్టరు, కవి, శతావధాని సరసుడు, అత్యంత స్నేహపాత్రుడు శ్రీ మేడసాని మోహను గారు కొండపై శ్రీనివాసుని చేరువగల కాళహస్తీశ్వరుల దర్శనముకై చాల తోడ్పడిరి. ఈ సందర్భమున నా కవితా వ్యాసంగ మును గూర్చి వారు ప్రస్తావించిరి. నేను శంకరుల జీవన చరిత్రను వ్రాయుచున్నా నంటిని. దానికి వారు సంతోషించి తెలుగులో వెంపరాల వారు శంకరుల చరిత్రము వ్రాసిరి. అది పండిత వేద్యమై యున్నది. మీరు పూర్తి చేసినచో పండిత పామర వేద్యమేగాకత్యాధునిక వైజ్ఞానిక సమన్వితమై యుండగలదు. దీనిచే భారతీయ సంస్కృతికి చక్కని దోహదమేర్పడును. దానిని తిరుమలదేవుడే ప్రకటింప గలడని బల్కిరి. ద్విగుణీకృతోత్సాహముతో శంకరుల చరిత్రను పునరాలోచించి పూర్తి చేసితిని.

ఈ విషయము కర్ణాకర్ణిగ శ్రీ శృంగేరి పీఠాధిపతులకు తెలిసి వారు తన్ను చూడవలసినదని ఆజ్ఞాపించిరి. శ్రీ యం.కె. కృష్ణమూర్తి సహాయముతో శృంగేరి స్వాములవారిని దర్శించితిని. అప్పుడు శంకర విజయ ప్రసంగము వచ్చెను. నేను వ్రాసిన పుస్తకమును వారు తీసుకొని మరుసటి దినము తన్ను చూడమని దెల్పిరి. తత్త్వము జీర్ణంచుకొన్న తపస్సంపన్నులే గాదు. తెలుగుభాషలో భావములో అనుపమాన ప్రజ్ఞాశాలి వారు. ఇక నారచన యందేమేమి యెక్కడెక్కడే లోపములున్నవో యని ఆ రాత్రి యంతయు భయావహుడనై గడిపి మరుసటి దినం ఉదయం 9-30A.M. వారిని చూచితిని. అనతి దూరమునుండియే నన్ను చూచి మీ రచన చక్కగానున్నదని దగ్గరికి చేర బిలిచిరి. అమ్మవారి యనుగ్రహమని గురువుల వారిని సమీపించి

వారడిగిన ప్రశ్నలకొక రీతి జవాబు చెప్పితిని వ్యాసునికి శంకరులతో జరిగిన వాగ్వివాదము బదరి కాదు మణికరికా ఘట్టమని వారీ గ్రంథమున కొన్ని మార్పుల సూచించిరి అందులో కొన్ని సముచిత మనిపించెను మరికొన్నింటిలో ఔచిత్యము భంగముకాగల దేమో యంటిని భంగము రాదు చెప్పినటు చేయండి అనిరి నాకు గల కొన్ని సంశయము లీమరమును గూర్చి ప్రశ్నించితిని దానికి వారు తగు సమాధానమిచ్చుటయే గాక ప్రామాణిక గ్రంథముల చూపుడని చేరువనున్న పండితులకాజ్ఞాపించిరి కాని అక్కర లేదు తమ మాట నాకు ప్రమాణమంటిని దీనితో ఒక్కరాత్రిలో సుమారు వేయి పద్యములు చదువుటయేగాక అక్కడక్కడ గుణదోషముల గుర్తించి సవరింపకొన్ని మార్పుల సూచించిన వారి శక్తి సామర్థ్యములకు నమస్కరింపవలెనేగాని ఆ యోగ్య ˘ను తూచే శ‌్త నాకు లేదు వెంటనే ప్రసన్న హృదయులై వారు ఫలాకతలతో శాలువనిచ్చి ఆశీర్వదించిరి ఇంటికి వచ్చి గురువులు చెప్పినట్లు సవరింపగ గ్రంథమునకు ఔచిత్య భంగము రాదుకదా రసవ్యంజకమేర్పడెను మహాత్ముల వచనములు సార్యకాలిక సత్యములనుట ప్రత్యక్షానుభవమయ్యెను

ఇక గ్రంధ ప్రచురణకై ప్రయత్నించుచుండగ కంచి స్వామీజీ వారిమాట మేడసాని వారి సలహా జ్ఞాపకమునకు వచ్చెను వెంటనే బెంగళూరి యందొక ప్రెస్సుకు పోయి పుస్తక ముద్రణకు అందాజు 30 వేల రూపాయలు కాగలదని Est mate తీసుకొని జగద్గురు విలాసమును TTD వారికి బంపితిని వారు దానిని నిరేత పండిత ప్రకాండులకు బంపరి ఆరు నెలల తరువాత అందరూ బరిశీలించి యీగ్రంథము భారతీయ సంస్కృతీ ప్రచారమునకు ఉపకరింపగలదు ఇది శ్రేష్టకృతి దీనికి వీలయినంత ద్రవ్య సహాయము చేయదగునని ఏకాభిప్రాయమును ప్రకటించిరి

దానితో TTD వారు 15 వేల రూపాయలు ముద్రణా వ్యయమునకీయ గలము ంతకు పైమేమిచ్చుటకు TTD నియమావళి సమ్మతింపదు తక్కిన ద్రవ్యము మీరే సమకూర్చు కొనవ నని దెల్పిరి దాని సమ్మతించి నేను చిత్తూరు లా చౌడేపలెలోనున్న వి యవాణి పబిషర్స్‌ను చూచి ని వారు నాకాప్తమిత్రులు మీరీ విషయమున చిం ంపకుడు పుస్తకమును ముద్రింతుము ట మనకు వ్యాపార సం ంధములేదని వారు భరవసాయిచ్చిరి కాని మిత్రుల ప ంత భారమువేయ మనసొప్పలేదు

ఈ పుస్తకము మంచి పేపరు చక్కని బైండింగు సర్వాంగ సుందరముగా నుండవలెనని ఎట్టైన తక్కిన ద్రవ్యమునకై యత్నించితిని ధ్వన్యాలోక డైరక్టరు పద్మభూషణ స డి నరసింహయ్యగారిని చూచితిని వారు TTD వారి సహాయమునకు సంతోషించిరి నరసింహయ్యగారు తమ యింటిలో యీ పద్యముల ప్రశంసించుచుండగ వారి మరదలు యలక్ష్మమ్మగారు నన్ను చూడకపోయినను నా పద్యములు వినకపోయినను చార్య శంకరులపైగల భక్తి తమ బావగారి మాట పై గల విశ్వాసముతో 2 వేల రూపాయలు తమ కుమారుడగు శ్రీనాధునితో యిచ్చి పంపరి ముద్రణానంతరమొకసారి యీ పద్యముల వినవలెనని ఆశించిరట

ఈ గ్రంథ ముద్రణమునకై అత్యల్పకాలమున కావలసనంత ద్రవ్యము స్తక నుల ఔదార్యమున చేకూరెను ఇక్కడ ఎవ్వరెంత యిచ్చిరనుటకంటె భగవత్పాదులపై విలువ కట్టరాని భక్తి శ్రద్ధలుగల జాత దాతల మైసూరునందున్న ప్రసద్ధ చారడ్ అకౌంటంటు హరిహరను మైసూరు లుగు సాంస్కృతిక సమి బెంగళూరిలో సకలాజీ మార్కట్ జ్యూవలరు నరసింహుల శ్రేషని మైసూరు గోపికా అగరుబత్తి య మానులను స్మరింపక యుండలేను శ్రీ TTD వారి సహాయము మరిమరి స్మరింపతగినది ఇంతేకాదు చౌడేపలె యందు వి యవాణి పబిషర్సును ష్టులగు సోదరచతుష్టమును ప్రశంసింపక యుండలేను ఈ కార్యమున ద్రవ్యము సహాయము చేయనింకను ఎందరో ముందుకు వచ్చిరి శంకరుల పై వారి గల భ శ్రద్ధలను కీర్తించుచు వలసనంత ద్రవ్యము వచ్చినది ఇక చాలునని వారి మనసార చేయెత్తి నమస్కరించితిని

భగవత్పాదుల జీవిత చరిత్రపై పరాధిపతుల నుభవజుల ఆశీస్సుల పొందదలంచితిని భారతీయసంస్కృతికి శంకర రామాను నంద తీర్థులసేవ అత్యనుపమము ఈ మూర్తిత్రయమే సనాతన ధర్మమున కాధారస్తంభములు సత్యాన్వేష లో కనబడే రూపమునకు భావించే గు ములకు తీతమైన నిర్గు పరబ్రహ్మ తత్త్వమును ప్రతిపాదించిన శంకరుడు ఉపనిషద్బ్రహ్మవాది ప్రస్థానత్రయమునకు ద్య భాష్యకారుడయ్యెను కానీ యీతని జానమార్గము సామాన్యులకు దురవగాహమగుటచే సగుణోపాసకులగు రామానుజుల వారు పరబ్రహ్మ తత్త్వమును సకల కల్యా గు గణాభిరాముడగు శ్రీమన్నారాయణునిగా భావించి భక్తుల హృదయముల చూరగొనిరి ంతకంటె సులభతర మొనరించి నారాయణుడే సర్వోత్తముడని

రూపకల్పన చేసి పురుషోత్తముని సేవయే తరణోపాయమని ఆనంద తీర్థులవారు మతింత ప్ర లకు సన్నిహితులెరి పైరీతిగ జానభక్తి కర్మ మార్గముల పరబ్రహ్మతత్వము తెలిసి స్తుతించి సేవించిన అద్వైత విశిష్టాద్వైత ద్వైత ప్రవర్తకులు భారతీయులకేగాక సమసమానవజాతికే స్తుత్యార్హులు కాలానుగు ముగ బ్రహ్మతత్వమును ప్ర లకందించుటలో నీ మువ్వురు సులభతర మార్గముల చూపరేగాని వేదములకు ర్షధర్మమునకు సచ్చిదానంద సాక్షాత్కారమునకు ఎవ్వరూ విరోధులూకారు దూరమూ కారు కాన ఈ పఠాధిపతుల ఆశీస్సుల కోరితిని

కోరిన వెంటనే శృంగేరీ పఠాధిపతులు శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థులవారు శ్రీ శ్రీ శ్రీ దండి శ్రీమన్నారాయ చినజీయరు యతివరేణ్యులు ముళబాగలు శ్రీశ్రీ శ్రీపాదారాయ విజాననిధి తీర్థులవారు యీ కృ ని చూచి తమ అమూల్యాభిప్రాయములతో మంగళాశీస్సులనిచ్చిరి మైసూరునందున్న శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద శ్రమదత్త పఠాధిపతులు బ్రహ్మానంద పరవశులై చక్కని శ్రీముఖము నిచ్చిరి నుభవజ్ఞులగు పఠాధిపతుల శీస్సుల కోరి నేగాని గు దోషముల విచారించి కృ విమర్శనా పాటవముగల పండితుల విస్మరింపలేదు దానికె వేరుగా ప్రయ్నించుచున్నాను ఫలించిన వెంటనే ప్రకటింపగలను

శీర్వదించిన పఠాధిపతులను ప్రకటింప ద్రవ్య సహాయము చేసిన TTD వారిని తక్కిన స్తక నులను మైసూరు లుగు సాంస్కృతిక సమితి వారిని గ్రంథమును సర్వాంగ సుందరముగ ప్రకటించిన వి యవాణి పబిషర్స్‌ను గ్రంథ రచన లించి చ్చుటచ్చుట చక్కని సవర ల సూచించి ప్రోత్సహించిన ప్రతిభా పాండితీ ప్రభావులు సంస్కృతాంధ్ర విద్వాంసులు సచ్చిదానందాశ్రమ సేవాధురీణులు స్నేహితుడగు కుప్పా కృష్ణమూర్తి గారికిని ప్రోత్సహించిన ధ్వన్యాలోక నిర్మాతలగు పద్మభూషణ స డి నరసింహయ్య గారికి అన్నమాచార్య ప్రాజకు డైరక్టరు గారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారములు అందరికంటె ముందే ఆశీర్వదించిన కంచికామకోటి పఠాధిపతులకు భక్తిపూర్వక నమస్కారములు

ఇటు
బుధజన విధేయుడు
బ రామయ్య
(బాడాల రామయ్య)

# విషయసూచిక


| వ.సంఖ్య | విషయము | పుటసంఖ్య |
|---|---|---|
| 1. | ప్రార్థన | 1 |
| 2. | జన్మ | 2 |
| 3. | ద్విజన్మ | 9 |
| 4. | పునర్జన్మ | 18 |
| 5. | సందర్శనం | 30 |
| 6. | నిదర్శనం | 39 |
| 7. | ఆత్మదర్శనం | 49 |
| 8. | సుదర్శనం | 62 |
| 9. | దర్శనం | 83 |
| 10. | భిక్ష | 98 |
| 11. | వాదభిక్ష | 105 |
| 12. | అద్వైతసిద్ధి | 125 |
| 13. | మహాప్రస్థానము | 142 |
| 14. | శీర్షికా పద్యములు | 174 |
| 15. | తప్పొ-ఒప్పుల పట్టిక | 176 |

ఓ

# ప్రార

ఓంకారంబై త్రిగుణా
లంకారంబై యనంత లక్ష్మీ ప్రదమై
శంకర సన్నిభమై మో
క్షాంకితమగు బ్రహ్మపదవి నర్చింతు శివా 1

ఎవడహంకారమమకార హీనుడగుచు
తానహంబ్రహ్మమను సూక్తి ధరణిచాటె
జ్ఞానమే బ్రహ్మమంచు జగమ్ము తిరిగి
మతములన్ నిల్పె నాజగన్మాన్యు గొలుతు 2

జగతి మిథ్యయంచు సర్వముఖల్విదం
బ్రహ్మమనెడి శ్రుతికి పట్టుబడుట
మాతృకర్మ యతికి మాన్యమౌటనుభవ
హృదయమెఱుగుకాని స్మృతులెరుగవు 3

ఏ మహాత్ముని భాష్యమే ఇల ప్రసద్ధ
మై ప్రవృత్తి నివృత్తి మార్గైకమయ్యె
శూన్యమున్ పూరమొనరించు పుణ్య పురుష
చరితమాదర్శ మా జగద్గురుని కొలతు 4

బహుభాషల బహుమతముల
బహుజనముల పలు విధాలవర్ధిల్లెడి యి
మ్మహానేకాత్మగ నడిపెడి
మహనీయుని సంస్కృతి, కృతి మాన్యముకాదే? 5

సర్వధర్మ సంస్థాపనాచార్యుడాత్మ
వేది సర్వభూతహితుండు వేదమూర్తి
శంకరుడఖండభారత సంవిధాయి
ఆతని కృతి జిజ్ఞాసకే యంకితంబు

# జన్మ

స్త్రీ పురుష విభాగమె లేక సృష్టి లేదు
సృష్టియేలేక చేతనాచేతన ప్ర
పంచమే లేదు ద్వైతమే ప్రబలకున్న
ఉనికియేలేదు పరమాత్మ నూహసేయ॥

జన్మ

శ్రీలు చెలువారు త్రిగుణాబ్ధి జీవనపు ట
లల నిలుపు శక్తి పీఠంబు లలితకళల
నెలవు నిత్యనూతన సృష్టి కులుకు కేర
ళావని భరత లక్ష్మికి ఆత్మబలము 1

అందె కాలడీ గ్రామమాధ్యాత్మ శక్తు
లార విరిసిన వేద వింధ్యాటవి అది
ఉపనిషద్వన కలకంఠి ఉన్నతాగ
మ విపనమయూరి ఓంకార మంజులశుకి 2

అమల పూర్ణాస్రవంతి అనాహత ధ్వ
ని యన స్రవియించు జలజల నిస్వనాన
అనవరత మాదరిన్ వృషభాచలంబు
శుద్ధ బుద్ధ ముక్తాకృతి సుకృతి నింపు 3

సాధకులకు సర్వశక్తులందింప పూ
ర్ణానదీతటాంచలాన దుర్గ
నిలిచె బ్రహ్మ విద్య పొలుపార నావృషా
చలపురారి ఆత్మ కళల నెగడె 4

ఈబరస్పర భిన్న ప్రకృతులకిదియ
కేంద్ర బిందువనగ జగచ్సృష్టి పూర
మగుచు పూర్ణానదీ వృషభాద్రులిటనె
చాటె నద్వైత మీ చరాచర జగాన 5

కలడు శివగురుండాయూరి కంటి దీప
మతని భార్య ఆర్యాంబ స్నేహానురక్త
వారి దాంపత్యమాదర్శపూరితంబు
అదియె సంసార సారోదయంబునయ్యె 6

## జన్మ

ఉపనిషద్ధర్మ మాత్మగా నురవడింప
సకల శాస్త్రసారంబు కెంజడలు కాగ
స్మృతి పురాణంబులింద్రియ తతిగ నడప
శివ గురుండమృత నంద జీవియయ్యె 7

పరుల జూచియు భేదభావంబుగనడు
రసములన్ గ్రోలుచు రుచుల వశుడుగాడు
లోకవర్తనుండయ్యు మఱువడు శివుని
ఇహపరంబుల సేతువై ఎసగెనతడు 8

పండిన బ్రహ్మ తేజమున్ పారజూచి
పరమవైరాగ్యమూర్తియౌ పతికి మ్రొక్కె
కాలమున్ గెల్చు నందను కాంక్షసేసి
గరిత ఆర్యాంబ నడచెనొక్క తొలిసంజ 9

పూరలో మునిగి మడుగు పుట్టమున్ ధ
రించి లలితా స్తుతిన్ చనుదెంచి దురిత
దుర్గమ జననాబ్ధి తరింప దుర్గకెఱగె
అంబపుష్ప మార్యాంబ శిరంబున పడె 10

క్రొత్త కోర్కులు గుండెలో గుబులు కొనగ
తడబడచు వచ్చి పతి పదద్వయము నంటె
కలకల ధ్వని కొమ్మపై చెలగ జంట
పక్షులను చూచి సతి తలవంచె పజ్జ 11

లలన మెఱుగు చెక్కు లెలహృదయమెరింగి
శివగురుండు సాంబశివుని దలచె
సతిని చేరదీస సానురాగంబుగా
అమృత మథన మయ్యె నాత్మలందు 12

జన్మ

ఆ సతీపతు లేక శయ్యాత్మ నలర
స్వప్న మందు ప్రత్యక్షమై శంభుడడిగె
పెద్ద కాలంబు జీవించు పెక్కు సుతులొ
అల్పకాలంపు సుమతినో అడుగుడనగ 13

అల్పాయుష్కుండయ్యు న
నల్ప ప్రజ్ఞావిలసితుడౌ సర్వజ్ఞున్
కల్పాంత యశంబందగ
పొల్పగు నీ యట్టి సుతుని భువికిమ్ము శివా 14

అని సాష్టాంగపు దండ
ప్రణామ మొనరించి భక్తి పరవశులై వా
రు నుతుల్ సేయంగ తథా
స్తనునుడి కర్ణముల సోకె నమృతోపమమై 15

ఆదిమ పురాణ దంపతులంతకంత
అర్ధనారీకృతాకృతి నంతరింప
భవుని బల్కులే బిడరూపాన ముందు
ఆడుచున్నట్టులయ్యె స్వప్నానుభూతి 16

బల్లటంచును తెల్లగా తెల్లవారె
చల్లగాలి మేల్కొలుప నా జంట ఒకరి
పల్కులింకొకరికి బ్రతిధ్వనులు కాగ
పొందు స్వప్నానుభూతికి బొమ్మలైరి 17

ఇరువురికి ఒకే రీతిగ నెఱుకవడిన
స్వప్న దృశ్యంబు సత్యమై పరగునంచు
త్మ ననపత్యతాదోషమడగునంచు
బ్రతుకు క్రొంగొత్త కోర్కులబరవశించె 8

జన్మ

కల కనులనిల్వ దేహంబు పులకరింప
రాగరసరమ్యయై సతి ప్రభుని కలిసె
ప్రభుని తేజ మార్యాంబ గర్భమున బండె
కాలపురుషుని మాయలు కట్టువడియె 19

చలనము నిశ్చలనంబై
కళలకు జీవంబు వచ్చె కమ్మదనమ్ముల్
నెలకొనె నోటి కెలంకుల
నెలతకు నెల తప్పె సృష్టి నిండుదనమ్ముల్ 20

నవమాసంబులలో పూ
రవికాసంబంద ప్రకృతి ప్రస్ఫుటమయ్యెన్
శివగురు డార్యాంబాహృద
య విహారుండయ్యు తప్పడాత్మ పథంబున్ 21

ప్రథిత మీశ్వర నామ వర్షంబునన్ ప్ర
శస్త వైశాఖ శుద్ధ పంచమి పగలున
కటకలగ్న మారుద్ర నక్షత్రమందు
అనుపమసుతు శివాంశునార్యాంబగాంచె 22

శివగురుడీ వార్త దెలిసి
నవజాత శిశువును చూచె నయనోజ్వలుడై
వివరించె సతికి మనకా
శివుడిచ్చు వరంబుబండె శీఘ్రంబుననే 23

కుంభమందు గురుడు కోదండమున శని
మీనమందు కుజుడు మేషమున ర
వి బుధ భృగులు సేర వృషభస్థరాహువు
ద్వాదశ శశి శాశ్వతయశ మొసగు 24

జన్మ

గురుకుజ శనులా లగ్నే
శ్వరు చంద్రుని చూడ సుతుడు సర్వజ్ఞుడగున్
గురు బుధ రవికుజకవులం
దరు నాల్గును చూడ నితడు దార్శనికుడగున్ 25

ఉత్తర హిమాద్రి ఔన్నత్యమొప్ప నితడు
దక్షిణ పయోధి చైతన్య తత్త్వ మంది
సర్వభూతహితార్థియై జన్మదాల్చె
అభవుడె జగదాచార్యుడై ఖ్యాతిగాంచు 2

నాస్తిక మతస్థమౌ లక్షణంబెరింగి
ఆస్తిక మతాల భిన్నత్వమంతరింప
వేద విహిత ధర్మంబు రూపంపనితడు
సచ్చిదానంద తత్త్వమున్ చాటు జగతి 27

శంకరాను గ్రహప్రాప్త జననమందె
సకలలోక వశంకర స్వామి యగును
జీవుల దరింపచేసెడి శివుడు గాన
శంకరుడను పేరితనికి సార్థకమగు 28

నిత్య సత్యమయ్యె నిరుపమరత్నంబు
చిద్విలాస మయ్యె జీవరథము
వతరించె అనుభవానంద ముపనిష
చ్చంద్ర చంద్రిక లిల జాలువార 29

సార్థకంబయ్యె మధ్బృహస్థాశ్రమంబు
తనయుని భవిష్యమలర దీవనల బోసి
త్మ సద్ధికై శివగురుండాక మున
ముందు చనుచుండ ర్యాంబ ముందు నిలచె 30

జన్మ

పాలిపోయిన చెక్కిళ్ళు పత్తి చెవులు
పసుపు రాచిన మోమును పైట జేర్చి
పచ్చి బాలెంత పాలిండ్ల పట్టి బట్టి
చెంత జేర మహాసాధ్వి **చిత మెరిగి**

సుతుడే గురుడై గురుడే
సుతుడై కడతేర్చు నిన్ను శోకింపకుమా
సతి పూర్ణంబగు మాతృ సు
**కృ న్ సన్యాసయైన కేల్మోద్భవ న్** 3

తల్లులకు తల్లి దుర్గ ఆ తల్లి కరుణ
తల్లి వైతి జగత్తుకే త్యాగమహిమ
చాట తలపున నెదుట సాక్షాత్కరింతు
ననుచు పతి దేవుడావృషభాద్రి కేగె 3

# ద్విజన్మ

జీవజీవుల భేదంబు, సృష్టి స్రష్ట
లగల తారతమ్యము, గుణత్రయ విభాగ
మంది, వన్నె వన్నెల రహస్యార్థమెఱుగు
దివ్య నేత్రమందిన వాడె ద్విజువరుండు॥

ద్విజన్మ

అష్టమూర్తియే యీ సృష్టియైన తీరు
తెలిస చాటి చెప్పగ మహాదేవుడిందు
పురిట పొత్తిళ్ళ పాపడై పుట్టెననగ
స్ఫటిక సౌందర్య పూరుడై పరగె శిశువు

కురుల నిమురుచు పాలిచ్చు తరుణమందు
బొమల మధ్య పెట్టని కెంపు బొట్టు దోప
గొంతు క్రింద నల్లని మచ్చ గోచరింప
పాప కనుపాప శివుజూచి వడకె తల్లి

ఆ శశికళయె నొసట నాహ్లాదమొసగ
కన్నులరవిచ్చు మొగ్గలై కాంతులీన
శూలడమరుక ద్వంద్వమున్ కేలడాచ
పిడికిలి బిగించు శివుడంచు బిడనరాసె

గంగలేని ముంగురులు మోకాలి నంటు
కరము లమృతాంశు గేరు ముఖంబు శంఖ
చక్రమచ్ఛాంకితంబగు చరణయుగళి
చూచి పూరపురుషుడంచు సుతుని మెచ్చె

ఆత్మ కార్యమాకాశమై అవతరింప
అచ్యుతు ననంతు నఖిలాత్మునందుకొనగ
పైకి కేల్సాచు ప్పలార్పక దివిగను
పదములన్ త్రోయు సంసార బంధనంబు

యుకారముడగనమ్మయై ఓంకార
ముర్వి నిలప నో నిర్వచనపు
మాయయే విపరీతమై మ్మయయ్యెనో
నగ మ్మ మ్మ యనె వుండు

ద్విజన్మ

శూన్యమే శ్యామలంబని చూచి నవ్వు
కాదు కాదు విశ్వ వ్యాపకమయి సృష్టి
సంస్థితిలయల కాధారశక్తి పూర
మనుచు పాపడు మెడ  యప్పుడపుడె  7

ఓంకారాకృతితో చిటి
శంకరుడే తప్పటడుగు చాలించి వెసన్
శంకాకళంకిత జగం
బింకగ తా లేచి నిలచె మృగరాజు గతిన్

తలి చనుబాలరుచి చూచె ృగర్త
జనని యొడిలోన మొదటి వర్షంబుగడువ
బుద్ధి నడగు నహంక్రియా బోధనెరిగె
ఇంటనాటాడు బిడ రెండేండ్లు నిండ  9

వేకువన్ స్నానమొనరించి వేగలేచి
మాతనర్చించు దేవతా మందిరమున
వేదితంబుగు పాలు త్రాపించి తనకు
జోలపాడు తల్లిని చూచి చొక్కుసుతుడు  1

తల్లికొంగు బట్టి తనయుండు పెరటిలో
పూలు గోయు నీట ప్రొద్దు పుచ్చు
మడుగు మడగటంచు మడిగట్టు తల్లికి
కాళ్ళు వచ్చు బిడ్డ కష్టమయ్యె  11

ఒక నాడు తల్లి పొరుగిం
టికి పోవగ సుతుడు వెనుకటి సుకృతమే మే
లుకొలుప ధుర్గాదేవిన్
అకలంకపు ముగ్ధ భక్తి నర్చనసేయన్  12

## ద్విజన్మ

వచ్చి పయఃకలశంబును
మచ్చికతో ముందు వెట్టి మాతా! యిదె గో
ర్వెచ్చని పాలుంగొనుమా,
**నిచ్చయనుచు నీకు వేగ నేతెచ్చితిబో!** 13

కమ్మదనమొప్ప చక్కెర గలిపి నాడ!
ఆరిపోయిన రుచి యుండదమ్మ
**వేగ త్రాగు మా పావలె విద్య నేర్వ**
ఆలసించిన మాయమ్మ అలగునమ్మ!॥ 14

దినదినమ్ము మాయవ్వ తెచ్చి నీకు
పెట్ట, నీవును పాలు సేవించుచుంటి,
విపుడు త్రాగకే చూచెదవేటికమ్మ?
మడుగుతో తెచ్చి నాడ నామాట నిజము॥ 15

నా ముందు త్రాగరాదని
యేమైనను నీకు నియమమే యున్న నిదే
నే మరుగయ్యెదనని సుతు
డో మూలకునక్కి, మరుముహూర్తంబుననే 16

చనుదెంచి పాలపాత్రిక
గని, వెక్కసమున సుతుండు కనులున్నను గాం
చని కరినాత్మవు, నోరు
న్నను బల్కని రాయివైతి నా బ్రతుకింతే॥ 17

నీవు ముట్టని యీ పాలు నేను త్రాగ
నంచు సుతుడేడ్చి యేడ్చి ఆయాసమంది,
నిదుర మంపర కనుమూయ, నెదుటదేవి
అమృతమొలకించు కనుల సాక్షాత్కరించె॥ 18

ద్విజన్మ

రమ్మురారమ్ము నాతండ్రి రమ్మటంచు
చేరి, యొడిజేర్చి, నిమురుచు శిరమునల్ల
అన్న నీదెచ్చు పాలు నేనారగించి
నీకు కొంత నిల్పితి ఇది నీ వెరుగవు 19

ఊరకే బల్కుచుంటి నే నొల్లనంచు
పలుకు నీ తొక్కు బలుకుల పరవశించి,
ముద్దు చేష్టల జూచుచు మురియు చుంటి
అంతియే కాని నీ పైన అలుక లేదు 20

అన్ని విద్యలు నీయందె అడగియుండ
వేరు నేర్వగ నేటికో వేగిరపడ,
సకల విద్యాస్వరూపిణి శారదాంబ
యే నిను జయింపలేక నీ యాననడచు 21

లెమ్ములేలెమ్ము కంద సేకొమ్మటంచు,
బాలునకు పాలు త్రాపి భవానియె మరు
గయ్యె బాలుండు మేల్కొన గానవచ్చె
తల్లి యార్యాంబ బిడను దబ్బుకొనియె 22

తప్పకే ఉదాత్తానుదాత్త స్వరముల
నాలకించుచు వేద పారాయణాన
పులకరింపగ మేను శంకరుని ఆత్మ
ఋతపథంబున బడి సర్వమెఱుగ నేర్చె 23

పరిసరాంతర ప్రకృతి ప్రపంచమందు
శ్రుతి పురాణాది ఆగమస్మృతులు పొరలు
పొరలగ విరిస అనుభవంబునకు వచ్చె
మూడు నిండని బాలుని బుద్ధి పండె 24

ద్విజన్మ

కోకిలమ్మల ఓంకార కూజితంబు
మేలుకొలుప శంకరుని నేత్రాలు విచ్చె
కొండపై బుట్టు ప్రొద్దుకు కొలనిజలజ
ములకు గల స్నేహమెంతయో కొలత పెట్టు 25

ఏటి క్రీస్పృష్ట యంతయు నెఱుపు తెలుపు
నలుపులంబడి చిత్రమై చెలగు చుండె
అంతు లేని యీ యాటలకర్థమేమొ?
తెలియవలెనంచు బాలుడూహలను దేలె 26

వయసు కందని వాక్కులు వాక్కుకంద
రాని భవ్యదర్శనము దర్శనమునకు న
తీతమౌనొక్క దివ్యానుభూతి గవియ
చిత్ర చిత్రమై బాలుని చేష్టలొప్పె 27

పన్న వాని బల్కుల తీరు వేద విహాత
ఋతపథాభ్రవిహారియై యెగెరిడి యెద
మౌన ముద్రిత చేష్టల మర్మమెరిగి
ఉపనయన సంస్క్రియయె విధి యుక్తమంచు 2

వేద విద్వాంసులం బిలిపించి తల్లి
తగిన యేర్పాట్లు గావించి తలప పతిని
శివగురుండాక్షణంబున చెంత నిలచె
సాధ్వుల తలంపు సద్ధికి సాక్ష్యమయ్యె 29

విప్రబృందంబు వచ్చి వేవేగ ఎదుట
బ్రహ్మ వర్చస్సుతో దిశల్ ప్రబల జేయు
శివగురునికి నమస్కృతుల్ సేయ వారి
నాదరోదార చిత్తుడైనాతడరసె 30

కుశల ప్రశ్నలగావించి కూర్చొనుడని
ప్రీతితో బల్కి తానుపవిష్టుడయ్యె
విధినియుక్తంబు విప్రుల వేద ఘోష
మింటినంటె మంత్రాంగణమంటపమున 31

తలయంటి నీరు పోసి కు
రులార్చి మగటంబు కట్టి రుచితర ఫాల
స్థలి బొట్టిడి బాలునికిన్
అలనల్లన సుతుని తోడ నంబయువచ్చెన్ 32

వినయ వినమితగాత్రుడై పెద్దలంద
రికిని పదములంటి నమస్కరింప అప్ర
తిముడయి బ్రతుకుమని వారు దీవనలిడ
బాలుని తలిదండ్రుల హృదయాలు పొంగె 33

తండ్రి కుడితొడ నల్లనాత్మజుని చేర్చి
శ్రవణమందు గాయత్రి మంత్రముపదేశ
మున్ సలుప రహస్యముగ నా బుడుతనికట
అర్థపూరిత మంత్రంబు నా కృతిగొనె 34

ఇరువది మూడున్నర అ
క్షరములె నొకియింత వంగి చలియించు చరా
చర మహా గోళాకృతియై
మరుక్షణముననె అదృశ్యమై బుతమయ్యెన్ 35

మిరుమిట్లుకొలుపు కాంతుల
నెరవిరియుచు పద్మమందు నిఖిలాభరణాం
బరధారిణియై ఒక సుం
దర సురచిరకాంత ఎదుట దర్శనమిచ్చెన్ 3

ద్వి నృ

లీల ముక్త విద్రుమహేమ నీల ధవళ
కాంతుల ముఖపంచకముగా గ్రాల వహ్ని
వదన మజశీర్షమై విష్ణు హృదయ మలర
రుద్రశిఖలతో పరిపూర్ణ రూపుగట్టె 37

మూడు కనులు చంద్రమకుటంబు కలదేవి
భూర్భువస్సువర్లోక ప్రపూర యగుచు
వేద మాతగా స్ఫురియింప వెఱువక సుతు
డాత్మబుద్ధి ప్రచోదనంబర్థిగోరె 38

సౌరశక్తి సావిత్రియై శబ్ధశక్తి
మధురగాయత్రియై మహామహిమలంద
జ్ఞానము సరస్వతీ రూపుగాంచి వటుని
ఆ మహాశక్తులన్నియు నావహించె 39

పంచశిఖల విప్రవటుడప్రతిముడగుచు
బ్రహ్మ ముఖుడయ్యె రుద్ర శిరస్కుడగుచు
విష్ణుహృదయుండునై వచ్చి వేద విహాత
భికగోరె సువాసనీ బృందమందు 40

భవతీ భిక్షాందేహి య
ని వేద జనయిత్రి పుత్రునిన్ నవ వటు సా
ధు వినుతు జగదారాధ్యున్
ప్రవిమల శంకర కుమారు వదనము చూచెన్ 41

చూచి పసుపు జన్నిద మొప్పు సుతుని పాత్ర
ప్రథమ భిక్ష పెట్టంగ నార్యాంబయందు
ముగ్గురమ్మల నొకటిగా ముప్పరిగొను
శ్రీ మహాదేవినే చూచె చిట్టి వటుడు 42

ద్విఒన్మ

మాతృరూపంబుగా జగంబునాతడరయ
భిక పెట్టువటునకు సాధ్వీమ తల్లు
లెగబడిరి నేనునే ననీదృశ్యమెంత
మధురమో ఆది భిక్షువే మది నెరుంగు

సాష్టాంగ నతుల భక్త్యా
విష్టుండై ప్రణుతి సేసి విమల శివగురున్
విష్టపసర్వారాధ్యున్
ఇష్టంగని మ్రొక్క పుత్రునెరిగి గురుండున్

బాలునిలో స్పష్టంబగు
బాలేందు ధరుని గని పితృ భావముపొంగన్
లోలో మెచ్చుచు నాత్మజు
చాలున్నిక జన్మమంచు నకుడు సుతుతోన్

సత్యమే విధాత చైతన్యమే విష్ణు
వాప్రమోదమీశుడౌ త్రిమూర్తి
తత్త్వమిదియె తెలిసి తరియింపుమాయని
తిరిగిరాని పథము గురుడు చూచె

# పునర్జన్మ

మమతో లపు సంసా
రమగాధపయోధి హమరయ మకరీ ం
ధము ట్ర చ వభద్రే
భమునకు దృఢభ_ యొక పరమార్థమగున్

పునరన్మ

ం మీయా గురు కృపానురక్తి
వేద వి న ను త్రవ్వి న యక
ని ల శాస్త్ర రహస్యార్థ నిధు గంటి
కళ పరమార్థ సారంబు లియవ చ్చ

ఏటి న్ని రూపా తో నీ గతు
వ్యక్తమగుచుం నేటి ప్రాణికోటి
ద్వంద్వ పరితప చిత్తు బాధపడుట
ఈవెతడంచు నాత్మ దే ద్విజుడగు

నానాకేశంబు తో
నానావిధ జీవకోటి నలుగుచునుం న్
ఈ నా జీవు జూచిన
మానసమత్యంతవెత మరగును తలీ

కు మత భేదంబు సం
క తం క మి లేమి కాటకము వి
హ్వ మై స్రపుంభేదం
మోహభ్రాం న గె భువనం న్

భేదమే లేక సృష్టి కన్పింపదయ్యె
భేద మున్నచో దు మ్ము ఫచ్చు పెరిగు
దు మీద్వైత గ లో దొ చు టులా
వెత జూచుచు ండగా త్ర తుక ను

కో కలే ద్వంద్వము కు
ర మ ద్రవి సహ ముగా మమ హం
ర ప్రే త మీ వా
పారము నరుండు వి చి వ యగు టులో?

పుస్తకజ్ఞానమబ్బిన పూర్తికాదు
చదువు దేశాటనంబున చక్కబడును
జ్ఞానమంతకంటెను ఘనమైనవిద్య
అనుభవజ్ఞుల సేవింప నదిలభించు

ఎందరో మహాత్ములీభూమిపై బూది
గప్పునిప్పుల వలె కానరారు
వారలకృష భేదభావంబులడగారు
గాదె? యనగ సుతునిగాంచి తల్లి

అన్న నీవు చాల చిన్న వాడవు పెద్ద
చదువులేల మనకు? జగములేల
వలెనె మనము? సంధ్యవార్చిన చాలులే?
ఇంటి పట్టు విడిచి యేగకయ౦

నేల ప్రాకు పాము నింగి నెగయు పకి
గడ్డి తినెడి గోవు కండ గోరు
వ్యాఘ్రములకు సహ వైరంబు కూటికై
కలుగు చుండె దీని తొలచనగునె

ఎన్నియో నోములన్ నోచి నిన్ను గంటి
ఇంటి దీపమై యీ తలి కంటి పాప
వై కలకల నవ్వుచు సదాబ్రతుకు మిటనె
ఈ గద్విచారము మనకేల నంచు

స్వప్న వృత్తాంతమాత్మలో పడగలెత్త
కదప చిదుగుల నగ్గి భగ్గను విధాన
తాళలేక ర్యాంబ చిత్తంబు రగిలె
అంబయని సుతునెద కీడ్చి దుము కొనియె

పునరస్మ

తనువెల కన్నులై నిజ
తనయుని హృత్పంజరమున దాచుకొనగ ఆ పు
త్రునియం దపూర్వ శక్తులు
దనరె మహామంత్ర మహామ తలపులుబండన్

ఎవ్వడణిమాది సద్ధుల నెల్ల నెఱిగె
ఎవ్వడు షడంగ దర్శన హృదయుడయ్యె
ఎవ్వడష్టాంగ యోగంబు లెరుగనేర్చె
వాడె బాలుడై నేడు సర్వజ్ఞుడయ్యె

నియమానుష్ఠానము త
ల్లియా సంధ్యా పంబు స్మృతి హాతవేదా
ధ్వయనము జీవులపైదయ
నయమున్ దప్పక చరింప నందనుడింటన్

స్నానార్థంబె తలి ఒ
కానొక దినమున పవిత్ర గంగ మునిగి పూ
రా నదిగటున వ్రాలెన్
ప్రా ములాయాస మంది పటును దప్పన్

శంకరుడు సంధ్యవార్చి వ్ర
ంక విధిన్ తలి పదములంటగ రాన్ శూ
న్యాంక గృహమ్మున్ గని
శంకాతం త మనమున సంభ్రాంతుం

పరువులతో పూరానది
దరికురుకన్ శోష దూలు తలిని చూచెన్
మరగెడి చితంబున శం
కర కరములు దాక నని కన్నులు విచ్చెన్

ఆర్యాంబ లేచి సుతుని స
పర్యల్ గని మెచ్చుచు నను బ్రతికించెడి యీ
చర్యల నెంత నలిగితో
కార్యజ్ఞునికెఱుక వడునె? కాయపు వెతలున్॥

జనని చేయి వట్టి తనయుడింటికి వచ్చె
చుట్టు పట్టు జనము సుతుని మెచ్చ
అమ్మ! యేటి కీవు నా యేటికేగ! ఆ
యేటి నీపదాలకీడ్తు ననగ॥

చకిత నేత్రాబ్జయై సుతున్ జనని చూచి
ఏమి చెప్పితివయ్య! నీ యీమహత్త
ర ప్రభావంబు సహజమౌ ప్రకృతి శక్తు
ల నిల పోషింపవలెగాని చెనక రాదు॥

శక్తి గలదంచు విపరీత సాధన కది
వ్యయమొనర్చుట సజ్జన ప్రియము కాదు
బ్రాహ్మణుడు జితేంద్రియుడౌచు బ్రతుకు ననగ
తల్లి మాటకు తలవంచె తనయుడంత॥

అంబ వెతలకు వెతజెందనాత్మజుమది
కారు మబ్బులు గ్రమ్ముచు గాలివాన
రేగి ప్రకృతి విజృంభించె పృథ్వి సెదర
కుండ పోతగ వర్షంబు కురియసాగె॥

దరుల కిరువైపులంగల తరువులు తెగి
పడె, నదీమార్గమే మార్చె వాగు, శంక
ర గృహ సన్నిధిన్ సేరె పూర్ణ, మహితాత్ము
ల తపన వృథాయగునె? ఫలప్రదము మహికి॥

పులుగులకు ముందె మేల్కాంచి బుడుతడనుది
నంబు పూర్ణానదికి పోయి స్నానమాచ
రించి సైకత స్థలి సవితృజపియించి
ప్రకృతి సౌందర్య శక్తికి బరవశించు॥

జగతి నడపించు చైతన్య శక్తియేది?
సూర్యచంద్రుల వెలిగించు జ్యోతి యేది?
ప్రాణాలకు ప్రాణమిచ్చెడి ప్రాణమేది?
అందియందని యీ గుట్టునరయుటెటులొ!

మింటి వెలుగులకును మంటి పులుగులకు
కలుగు బంధమేదొ! గాంచు టెటులొ!
ఈ చరాచరముల కేమి సంబంధమో!
తెలుపు వాడెవండొ! తెలయుటెటులొ!॥

ఎడతెరపి లేక యీ యేరు నేగుచుండె
గట్టు కొమ్మలకొనగోటి పిట్టలకెగ
ప్రాకె కరినాగు నామింట గ్రద్దలాడె
బ్రతుకు పోరాట మగు చుంట వటుడెరింగె॥

బురదనాడుకొనెడి బుడతని వీక్షించు
కోలు నూది నడచు గూనిని గను
శవము వెంట నడుచు జనముల జూచి యీ
బ్రతుకులింతె యనుచు వగచె వటుడు॥

రూపరసగంధ గుణముల రుచిరమైన
ప్రాకృత శరీర భవనాన ప్రాణమెటుల
వచ్చెనో! కడకేరీతి వదులునో ర
హస్యమీ రాక పోకల కర్థమేమొ!॥

పునర్జన్మ

విరులు వాడిన గంధంబు విడువదయ్యె
బిడ జొమ్ము గుద్దిన తల్లి విడదు మమత
సృష్టి మరుగైన బ్రహ్మంబు చేటువడదు
నశ్వరానశ్వరప్రబంధ బలమెంతొ

సర్పములకిండ్లు గట్టెడి సంఘజీవి
చీమ విషమునందిసుధ నిచ్చెడి మహోప
కారి వృక్ష మీజ్ఞానవిజ్ఞాన విదుడె
నరుడె యేటికో స్వార్థాగ్ని శలభమయ్యె

పకులందున్న నిర్మలంబైన మమత
ంతు వర్గంబులో గల సహ ర్త
వక్రమై బుద్ధి జీవుల బాధ పెటె
ఈ విడివడని ముడి విప్పుదేవుడెవడొ

టి గురుమూ్త కన్పించు నంతవరకు
కార్యకారణాత్మక కల్పక మగునన్ను
నేన తరచుట విధ్యుక్త నియమమంచు
బాలుడంతర్ముఖుండౌచు బ్రతుకు చుం

వివిధ వేద వేదాంగాది విద్యలె
బ్రతుకు గురి చూపునేగాని ఫలితమగునె?
ఏడు నిండని శంకరునె గి బుధులు
సర్వ క త శంభుడనిరి

శమదమాది సక సద్గు సంప్త
ం భ చిరతరానుర
సక శాస్త్రయు స పూర్ణ ధారణా
శ్త చూచి గురు చ తు రి

రాజశేఖరుడానగర ప్రభుండు
బాలశంకరు కీర్తి నల్వైపులలమ
మెచ్చి అతని సన్మానింప నిచ్చగించి
కాన్కల సుధీజనాళి నాకడకు బంపె॥

పండితులు దెచ్చు సన్మాన పత్రమరసె,
నృపుడు బంపిన కాన్కల నిధియు చూచె,
పండితులకు మ్రొక్కి ప్రభుని భావ మెఱిగి
కాన్కల నిరాకరించె శంకరుని ఆత్మ

జలజపత్రాన చంచల జలకణంబు
రీతి, భూమిపై బ్రతుకు నర్తించుచుండె
సాధు జనమైత్రి క్షణమైన సలుపదగును,
అది, భవార్ణవ నౌకయై అవల జేర్చు॥

ఈ ధనాగముతృష్ణ క్షయించుగాక,
మనసువైరాగ్య సీమల మరలు గాక,
చాలదా సాధ్వులిచ్చు భిక్షాసనంబు
చిత్తమాశివున్ చేర్చుటే సేమమంచు

గ్రామ సీమల వసియించు బ్రాహ్మణవటు
నకివి దుర్భరంబే గా కనవసరమన
సిగ్గుతో పండితుల్ నమ్రశీర్షులగుచు
ప్రభుని జూచిరి ప్రత్యుత్తరంబులేక॥

తిరిగి వచ్చు బుధుల దీన దృక్కుల గను
క్రుద్ధుడై రాజు సిరులతో కొట్టె త్రిప్పి
మమ్ము బాలుడహంకార మానసుండొ!
వీతరాగుడో బ్రతుకుటే వింతగాదె?

ఆగ్రహాధికారంబులేయనుచిత మిట
ధనజనబలంబు లీపట్ల పనికి రావు
ఎవడొ, కారణపురుషుడీ యెడ జనించె,
ఇతని దర్శనమే పురాకృత సుకృతము॥

ముందు వెన్కల తిరుగుచు డెందమందు
దిక్కుతోచక రాజమందిరమున బడి
ప్రభువుగా బుట్టుటే భువి పాపమంచు
వగచు రాజశేఖరుచూచి ప్రాజ్ఞుడొకడు॥

వీత రాగుడే గాని యీ వింత వటుని
ఆత్మయందింక జిజ్ఞాస యారలేదు
నీ రచిత నాటకముల విన్పించి అతని
యుల్లమున్ వలపించుటే యుక్తమనగ

నిజము నిజమిదే నాకిక నిర్వృతి పథ
మని నిరాడంబరమున శ్రద్ధాన్వితుడయి
నాటకత్రయిన్ గొని జననాథుడొకడె
పాదచారియై గుట్టుగా బాలుజూచె॥

తల్లిపాదంబు లొత్తుచత్యంత భక్తి
ఈ పదద్వంద్వమే జగద్ధితము కూర్చు
సృష్టి సంస్థితిలయలకు జీవమంచు
పాడుకొనుచున్న బాలుని పదము వినియె॥

ముందు బడలేక కేరళ భూవిభుండు
మంత్రరుద్ధమహానాగమై లలితప
ద ప్రయోగ సరణికి తాతన్మయుడయి
నాన్యతోలభ్యమని ముందు నడువనుండ॥

పునరన్మ

బాలుడెదురయ్యె సభ్రమప్రభుని చంక
జారి పడు నాటకము హసమున టి
శంకరుండిటునటు ్ర ప్ప సంతసమున
ప్రభుని కందించె నృపుడు దిగ్భ్రాం ంద

ప్రభువరా మీరు వ్రాసన గ్రంథము వి
లి స మొన్న మీ యాసాన ధీవరు ట
కొంత వివరింప వింటి మీ గొప్పగంటి
నాటకము సత్యమే? గన్నాటకమున

రా క ృత నాటక ర గమందు
జీవుడే నాయకుండగు చితమె స
యహం విదూషకుండయ్యె నిటర
సానుభూ యాభాస ్ర హ్మం దు

య్యు ్రు రసోవెసహ యనుచు చా
చ్యుత మనంత మానందమనుభవింప
్ర యే ్ర హ్మమౌనంచు బాలుడు కె
నని సేవకు నప సబ్బుడయ్యె

శంకరుడు శంకరుం ని సన్ను ంచి
కేలుమోడ్చె గత్ప బా వటుని
యశము న రంగు నం ం మెచ్చె
ర్భకుడు నదీ స్నానార్థమరుగుదెం

స్నానమొనరించి సంధా రు ప్రభ కు
ర్ఘ్యమిడు చుండ మక హఠాతుగా కు
మారు పదములం న్మ మింక
ంబా యనుచు వటుండరువ తొడగె

కేలు పైపైకి సాచుచు కూలు బాలు
ని దురవస్థ చూచి సఖులు నిస్పృహాయు
లై పరువులనేతెంచి ఆర్యాంబకెఱుక
పరుప రొమ్ము బాదుకొనుచు వచ్చె నామె

గట్టుపై నిల్చి మునిగెడి పట్టి నరసి
అంబ జగదంబ నీ బిడ నాదుకొనవె
అంచు వాపోవుచుండ నార్యాంబకంత
నీటి గర్భంబు నుండి విన్పించె నెలుగు

అమ్మ బ్రతుకు నీ బిడ సన్యాసియైన
అనుమతింపుమా సన్యాస మందుకొనగ
అటుల అటులనేతల్లి యీ య్యబ్రతికి
బైటపడ చాలు యతి పదంబందు గాక

సమ్మతించిన నని వాక్యమ్ముల విని
భయమిచ్చితి సకల భూతాళికంచు
శంకరుని ల్కు మంత్రమై గ నలమ
మకరితో పాటు సంసార మడగిపోయె

ఇంతలో మచ్చుకారులా దృశ్యమా
ంచి పర్వుపర్వుల వచ్చి నది ము
నింగి యీ ల మకరి నడంగ గ్రుచ్చి
గ్రుచ్చి దివికె్రి విధి పేర్కొన తరం ?

నక్రముకుడగుచు నలినాకుగొ ్బడి
భద్ర గ ము రీ పైకి వచ్చి
భయము తీరె త భవదా యంచు ని
జాం పదము ంటు నర్భకుగని

పసప్ఠప్మ

తల్లిమేనెల్ల చేతులై తనయుదడివి
ఎంత బాధించెనో బిడ నీ జలచర
మకట జలగండమున్ దప్పె అయ్యకంచు
జాలరులలో జగన్మాతలీల జూచె

తల్లి కన్నీరు తుడుచుచు తనయుడమ్మ
దేహి కీనాటితో బాధతీరిపోయె
ఏటికీరీతి మరిమరి ఏడ్తువమ్మ
నేను సన్యాసయైనను నీ సుతుడనె?

తల్లివి త్యాగమయివి నితాంత ధర్మ
శీలవు దయార్ద్ర చిత్తవు స్నేహమయివి
సకల జీవుల పాలిట సాధుమూర్తి
వీవ యిటులైన గమింక యేమియగున

తెలియ సదసద్వివేక వతికి తెలుపుట
యెట్టులో యన ర్యాంబ యెదకుదించి
ంత్యకాలానికైన నిన్నరయగలనొ
ంచు భోరని విలపంపనాత్మజుండు

శంకదక్కుమో నని నిస్సంశయముగ
తలచినంతనే నీ ముందు నిలచువాడ
గురునికె పోదు సెలవిమ్ము కొమరునికన
తండ్రి తండ్రికి మించిన తనయుడీవు

పోయిరమ్ము శుభము నీకు భూతకోటి
శుభము చరాచర మగు ప్రకృ శుభము
ంచు సుతుపల్లవ పదా ంచి కాంచి
కడకు కన్నీట గతినే గాంచదయ్యె

# సందర్శనం

ఒక్కడార్జనాసక్తి యూరూర దిరుగు
నింకొకడు జంటకై జగంబెల్ల చుట్టు
వేరొకడు స్వప్రతిష్టకై ఆరడిపడు
కాని గురునికై వెదకు జిజ్ఞాసి యొవడొ!॥

సందర్శనం

కాలడిన్ దుర్గయిచ్చిన కమ్మపాలు,
మధుర మీనాక్షి బెట్టిన మధురభిక్ష,
కంచి కామాక్షి వడ్డించు, కలరసాన్న
మారగించుచు, శంకరుండరుగుచుండె॥

సాధ్విలిచ్చుభిక్ష సంతృప్తి నందుచు,
ఊరుపల్లె లెల్ల నుత్తరించి,
ముందుకేగుచుండె,డెందము గురుదేవు
చూడ, విప్రవాటి చోద్యమరసె ॥

వికసితసంధ్యన్ వృద్ధుడు,
డుకృంకరణెధాతులోలుడు,వ్యాకరణో
త్సుకుడై వల్లించుటవిని,
చకితుండైవటుడు జాలిజాల్కొనబలికెన్ ॥

హేవిప్రా! గోవిందా,
గోవిందా, యని భజించి, కొనుమాముక్తిన్,
ఈవార్ధక్యంబున,ని
న్నేవిద్యలు గావవయ్య, యీశుడు దప్పన్ ॥

ఎంతవఱకుండునో జన్మ అంతవఱకు,
చావు తప్పదు మరిమరీ జనని గర్భ,
వాసమేర్పడు, సంసారదోషమెఱిగి,
యు,నిట మానవా యేసౌఖ్యమూహసేతు ॥

రేబవళ్ళిరు సంజేలు, ఋతువులారు,
తిరిగి తిరిగి యివేవచ్చు తెరపిలేక,
ఆడుకొనుచుండె కాల మీయాయువో,క్ష
ణక్షణంబడగారె కాంక్షలెగబడగ ॥

సందర్శనం

పట్టుదప్పె కీళ్ళు, పండెకేశంబులు,
పల్లుడుల్లె, మేను వడకుచుండె,
ఊతకఱ్ఱవచ్చె, నుల్లంబు మాత్రము
ఆశల చెలమయ్యె,నంతులేక ॥

ఆటలబడిబాలుండు, కాంతానురక్తి
తరుణు, డతుల చింతావ్యథన్ జరటుడడల,
బ్రహ్మమునకై పరితపించు వాడెవండొ।
ఎప్పుడో, యెక్కడో, యని యేగుచుండె ॥

అడవి పల్లెయందొక పూరిగుడిసెముందు,
అల్లనిలచి,"భిక్షాందేహి"యనగ, బాల
గురునిచూచి, ఆయిల్లాలు కొట్టవచ్చు
బ్రహ్మతేజంబునెరిగి, సంబరముతోడ ॥

బ్రాహ్మణకుమారుడీయింటివరకువచ్చి,
భిక్షవేడగ మా బువ్వపెట్టరాదు,
రిక్తహస్తాల బంపుట రీతికాదు,
ఏమిసేయుదు,నిరుపేద గృహిణినంచు ॥

పెరటివృక్షాన, కిరునెల్లివేగదెచ్చి,
వటునిపాత్రయందిడి, శివార్పణమనంగ,
శబరి దీన దృక్కుల నిరుత్సాహముబికె,
జాలిజాల్కొన శంకర స్వాంతముడికె ॥

శ్రద్ధ,భక్తి, సదాచార సంపదగల,
వారె దట్టదరిద్రులైవనములబడ,
భోగభాగ్యాల తూలిరి పురజనాళి,
చిత్రమక్కటా! శ్రీదేవి చేతలరయ ॥

పుట్టితిపయోధి, శశికి తోబుట్టువైతి,
పట్టితి జగన్నాథుకరంబు, ప్రణుతిగంటి,
ఆ సురాసుర ప్రజల కారాధ్యవైతి,
నీకు, కమలాలయకు, వక్రనీతి తగునె? 13

దీర్ఘమగునీ కటాక్షమిందీవరాక్షి,
తప్పిపైబడ, పేద కృతార్థుడగును,
ఇంతకే నీకు కొరయౌనె? హిమకరకర
మడవిపై, మేడపై, సమంబగుచుపడదె? 14

అడవుల యమాయక ప్రజ, అడలుచుండె,
కాయ కష్టోపజీవుల కనికరింపు
మమ్మయను, శంకరుని కంట నశ్రులొలికె
నెల్లిబంగారు పంటలా నెలతకిచ్చె॥ 15

సూర్య చంద్రులే గుడిసెల జ్యోతులయ్యె,
కాయకసరులే జీవుల గావదొడిగె,
నిస్సహాయత సహనంపునేల యయ్యె,
ఆత్మయె అదృశ్య రక్ష యీ యవనికంచు. 16

నడచుచుండ, సాంద్రాటవీనదినదాల,
చిత్ర చిత్ర దృశ్యముల వీక్షించె, వటుడు
కొత్త కొత్తనుభవములే గుబులుకొనగ,
ప్రకృతి సహజ గుణ ప్రభావంబెరింగె॥ 17

కాళ్ళు తడబడ కన్నుల కలయదిరుగ,
సాటి మృగములు తనుజుట్టి జాలిచూడ,
ప్రసవవేదన పడుచున్న వ్యాఘ్రినికనె,
బాధయానందపరిణామ భాగ్యమేమొ!॥ 18

తిరిగి తిరిగి యార్జించిన తిండి, తల్లి
గూటి పిట్టల నోటిలో గ్రుక్కుటెరిగె,
త్యాగమే జీవనంబయ్యె ధరిణికంచు,
పరవశానందమూర్తియై బాలుడలరె॥ 19

పరుగులుడిగిన మెకమునే బట్టి, కలచు
నాకలినడంచు, మృగరాజునాత్మనెరిగె
నిస్సహాయతయే మృగనేతకూత,
చావుబతుకులానందమే చాటుచుండె॥ 20

రాలిపడుచున్న జీర్ణపత్రముల జూచు,
చిగురులెత్తునదే మ్రోటి సొగసులెరుగు,
జననమరణాల మౌలిక సత్యమేదొ!
కాలమో! కర్మసాక్షియో! గహనమయ్యె॥ 21

జింకతోలుగట్టి, చిరునవ్వునవ్వుచు,
కొండమీద నిష్ఠకూర్చొనంగ,
బాలయోగి, నేల బ్రవహించు సెలయేరు,
మింటిమెరపులగని, మేనుమఱచె॥ 22

పృథివి మీరె, జలమ్ములనధిగమించె,
అగ్నిదాటి, యనిలమున కవలనెగసి,
అంబరముచేరి, తుదకు మనంబుజీల్చి,
ఆసహస్రారమందైక్యమయ్యెనతడు ॥ 23

పెళ పెళార్భటధ్వనులతో విరుచుకపడ,
మిన్ను ఝుంఝూప్రభంజనంబెగసె, యిహప
రంబులొక్కటిసేయ, వర్షంబు కురిసె,
చెక్కు చెదరక లేనవ్వు చెలగె వటుడు ॥ 24

ఎంతకాలమట్లుండెనోయెవని కెఱుక?
చెప్పదలచిన మాటల చిక్కడయ్యె,
తలపదలచిన బుద్ధికి తట్టడయ్యె,
చిన్నవాడయ్యు చిక్కని చిన్మయుండు॥ 25

బాల వర్ణిసన్నిధి తలవంచి ప్రకృతి
నిల్చెననగ, ప్రసన్నయై నింగిదోచె,
కమ్మని సుగంధపవనముల్ క్రమ్మతొడగె,
సంధ్యయోగిరాట్చరణాల సాగిలబడె॥ 26

గలగలధ్వని సెలయేరు గజ్జెకదిపె,
పులుగులెలుగెత్తి, వెలుగుపాటలు భజించె,
ప్రకృతి లేనవ్వులన్ పూలవాన గురియ,
వటుడు లేచి మృగేంద్రుకైవడిచరించె ॥ 27

వరహిరణ్యరేతపురూరవసుల తపము
పండి, యేకైక రూపమై పరువుదీయ,
నర్మద వయసుపొంగుల నాట్యమాడె,
పులకరించినమేనితో బుడుతడరసె॥ 28

చంచలతరంగ శీకర జలకణాల,
వివిధ విభ్రమ విభవముల్ విస్తరింప,
నిలిచినిలువని సొగసుల నింపునదియె,
తెరల తెరలగ ఆనంద తీర్థమయ్యె 29

చెంగుచెంగున జింకలు నింగికెగయ
చూచి చూడని సింగపు సొగసుచూచె,
పడగనీడమండూకపు పాన్పుచూచె,
పొదల పూదేనలన్ జూచి మురిసెవటుడు॥ 30

## సందర్శనం

దివ్యసుందర క్షేత్రమీ తీరమందె,
గురువరున్ చూడదగునంచు, తరలుచుండ,
శ్రవణ శుభగమైకోకిల ప్రణవమల్ల
గాలి కెరటాలపైబడి దారి జూపె॥ 31

ఆశ్రమము "హరిః ఓ"మ్మను నమృతవాక్కు,
గుండెవలె రవళింప, సద్గురునిజూచె,
శంకరకుమారు దేహంబు ఝల్లనంగ,
కన్నులరవింద సుమములై కాంతులీన॥ 32

తేరి చూడరానితేజోమయంబు, సం
ధ్యారుణప్రభల్ జటాళిమెరయ,
అగ్ని శిఖల బోలు నరుణాంబర శ్రీలు,
దిశలకంటుగురుని దృశ్యమరసె॥ 33

చొక్కిబాలయోగి, జోహారులోంకార
నాథ! బ్రహ్మతేజ! నలిననేత్ర!
శిష్యవృత్తి మిమ్ము సేవింప వచ్చితి,
స్వస్వరూపమేదొ, చాటుడనగ ॥ 34

ఉన్నదున్నరీతి, యుజ్వల తేజంబు,
పరమ శాంతమై, ప్రభాత సమయ
చంద్రబింబమై, ప్రసన్నగంభీరమై,
అమృతవాక్కులొలయ యతిగదోచె॥ 35

వేయిపడగల కాంతులు విచ్చుకొనగ,
శేషునతులతేజంబు దర్శింపగంటి,
యోగశక్తులు పూర్ణమై యుర్వినిలుపు,
ఆపతంజలిమహిమలే యరయగంటి॥ 36

కంటి, కావిరుచుల కాయమ్ము, సంధ్యార్క
బింబ శిరము, చిగురువెన్నెలతుటి,
కరమున జపమాల కకపాలదండమ్ము,
గంటి, యనెడి వటునిగాంచె గురుడు॥ 37

చెంతకరుదెంచి, అరచేత చిన్నవాని
శిరము దువ్వగ, వటుని హృత్సరసి పొంగి,
మఱుగుపడిన మాతృస్పర్శ మదికిదోచె,
శంకరుని కన్నులానంద సరసివిరిసె॥ 38

ఇంత చిన్నవాడవేరీతి సాంద్రాట
వీనదీనదాల, వికృతకంట
కావృతాచలాల, నధిగమించితివయ్య,
ఎంతబడలితీవు వృద్ధుజూడ ॥ 39

ఏనునీరాకకై యెదురెదురు చూచి,
తేజమ్మైపోవనుండ, యేతెంచితీవు
మరల నాకురూపంబు సంప్రాప్తమయ్యె,
ఇంతకెవ్వడవీవు? నన్నింతసేయ ॥ 40

కేలుమోడ్చిబాలుండు, నొక్కింతకనులు
మూయ, నెదురైన గురునకు మ్రొక్కె, సంధ్య
దోఘుగాయత్రినాత్మ సంస్తుతినొనర్చె,
విశ్వరూపాత్మకుడగు గోవిందుజూచి 41

తనువునార్యాంబ, ప్రాణమాతండ్రి శివుడు,
అష్టసిద్ధులందించె గాయత్రి శంక
రాఖ్యుడైతి నొకప్పుడు, నఖిల మడచి
గురులగోవిందపాదులకొలుతునిపుడు. 42

సందర్శనం

తనుమనఃకరణేంద్రియతతి తగులను,
ప్రాణబుధ్యహంకారాళి పట్టుబడను,
బంధుబలగంబులడగిన పరుడనైతి,
గురునిగోవిందు కొలచెడి చిరుతనిపుడు॥

జననమరణంబులంగల తనువు, క్షుత్పి
పాసలంగల ప్రాణంబు, లాశమోహ
మంటు చిత్తంబు, బంధమోక్షంబులవిడి,
గురునిగోవింద పదముల కొలుతుననగ

మంచిది కుమార! పోయి నర్మద జలాల
స్నానమొనరించి, ఓంకార నాథుగొలచి,
శిష్యుల సమస్యలందీర్చి, శీఘ్రమె యిట
రమ్ము సంకల్పసిద్ధి స్సిద్ధమ్ముకాగ

అన గోవిందుని శిష్యులు
సనుదెంచిరి, శంకరపద సన్నిధికిన్, వా
రును విద్యావంతులె, న
త్యనుపమలోకజ్ఞులయ్యు, నాత్మజ్ఞులుగాన్॥

# నిదర్శనం

అణువునందు బ్రహ్మాండమే యడగి నటుల,
విత్తులో బృహద్వృక్షమే విరియునటుల,
అక్షరంబున రసజగంబమరినటుల,
గురునిలో బరబ్రహ్మమే కూడియుండు॥

## నిదర్శనం

ఎవరమో! యెటనుండి, మేమెచటకెందు
కేగుచుంటిమో! యీజగంబేమొ! దేహి
దేహముల బంధమెట్టులో దెలియదలచు
సహచరులకౌతుక మెరింగె శంకరుండు. 1

పూర్వపశ్చిమ శిఖరాల పాదము సూర్య
చంద్రులన్ చూచి చూడక, శ్యామలాభ్ర
మాత్మకార్యమౌనని, మింటినరసి, వటుడు
విష్ణురూపా నమో! యని వినుతిసేసె॥ 2

వివిధ రూపాల దోచు నీవిశ్వమొక్క
వాసుదేవుని స్థానమై పరగె, నతని
జేరనడచుజీవులమని, శిష్యకోటి
గురుని చేతల కర్థంబుకూర్చుకొనిరి॥ 3

నర్మదన్ అఘమర్షణ స్నానమాచ
రించి అర్ఘ్యాంజలిన్ రవిన్గాంచి, వటుడు
అజలాల త్యజించుచునంబరమణి
నరసి, ఓంనమో నారాయణా! యనంగ॥ 4

ఒక్క రవి పెక్కుమంది యర్ఘ్యోదకాల
దోచురీతి, దేహేంద్రియాదుల వసించు
నాత్మయొకటె, వేర్వేరుగా నగపడునని,
అనుభవజ్ఞానులై శిష్యులలరుచుండ్రి॥ 5

బింబ సూర్యునికంటె, విభిన్నుడగుచు,
సలిల సూర్యుండు భాసించు సరణి, బుద్ధి
యందుభాసించు నీయాత్మ, యన్యమై స
దా చిదాభాసుడౌను, సత్యాత్మకాదు 6

## నిదర్శనం

చంచలాచంచలత్వముల్, సలిల రవికి
కలుగునేగాని, కల్గదాకర్మసాక్షి
కీచిదాభాసుకర్తృ భోక్తృత్వ గుణము
లాత్మకణుమాత్రమేనియు నంట వెపుడు॥ 7

ఉదక ధర్మమౌశైత్యాదులుదకమందు,
ప్రతిఫలించెడి, సూర్యుని బట్టనటుల,
క్రోధకామాదులాబుద్ధిగుణము, లంట
వీ చిదాభాసు, గురు వాక్యమిపుడు దెలిసె॥ 8

సతిసుతులను సంసారమీజగతి నెట్లు
బుట్టెనో? జీవికీబంధ మెట్లుకల్గె
నో? యని, కలతనలుగు శిష్యుల తలంపు
లాత్మదాక శంకరుడు ముందరుగుచుండి॥ 9

చెట్టు నెరనీడ పుట్టగన్పట్టుపురిని,
చూచి, గడగడ వడకు శిష్యుల భయంబు,
తరుగ వటుడంతమున్ముందు కురికి, పురిని
చూపె, వారి సర్పభ్రాంతి సురిగిపోవ॥ 10

ఈ సతీసుత బద్ధ సంసృతి, జగంబు,
రజ్జు సర్పమురీతి విభ్రాంతి కాని,
సత్యమెరుగ జగంబెల్ల మిథ్యయంచు,
శిష్యగణముల కనుభవ సిద్ధమయ్యె॥ 11

దేహిదేహ సంబంధంబునూహ సేయు,
సహచరుల సమస్యలెరిగి, శంకరుడట
పొదల పొరవిప్పి మెరుపుగా బోవు ఫణిని
చూచి, చూపుచు నాచార్య శోభమెరసె॥ 12

## నిదర్శనం

సహచరాళీయపూర్వ దృశ్యంబు చూచి,
క్రమముగా తేరుకొని, ఫణికరణి జ్ఞాని
స్థూల దేహంబు విడుచుచు, దుఃఖపడడు
ఆగతానాగతంబుల కంటడనిరి.

ముందువడిబాలుడొక కొల్మిముందు నిలచి,
అగ్నితప్తలోహంబగ్నియగుట చూడ
ఆత్మసంపృక్త దేహంబునాత్మ రీతి
చెలగునని శిష్యవర్గంబుదెలుసుకొనియె॥

గాలిసోకకురియుకరిమబ్బులన్చూచి,
గురుడు గుడిని చేరి, పరతదలప,
శిష్యగణము మాయచే చిక్కునాత్మయే
జీవకణములైన సృష్టియనిరి॥

చినుకులెల్ల రూపుచెడి పునర్నీరమౌ
భంగి..జీవులేయుపాధి చెడగ,
బ్రహ్మమగుట వారు ప్రత్యక్ష సాక్ష్యాన
యెఱిగికొనిరి నాటివరదలందు॥

దృష్టిదోషంబుచే, నిజస్థితి నెఱుగక,
కట్టెదుట దోచు, జగమెనిక్కమని, జీవి
కర్మబద్ధుడై, తన్నుదాగాంచలేడు
జనన మరణ వీచీమయ సంసృతిబడు॥

గోవింద గురుండాడు మ
హావాక్యంబుల రహస్యమవగతమయ్యెన్,
ఈవేళ శంకరునిచే
ష్టావళి బ్రహ్మానుభూతి నందించెనిటన్ ॥

## నిదర్శనం

ఆత్మయే బ్రహ్మమై జగంబలమెనంచు,
ప్రకృతి పాఠాల సత్యమున్ స్పష్టపరుప,
ఛాత్రవర్గంబువెన్నంట, శంకరుండు
గట్టున గల జోతిర్లింగుగాంచి, మ్రొక్కె. 19

ఓంకార శోభితా! స్నే
హాంకుర దీపకళిక! అమృతానందమయా!
సంకల్పవికల్ప విదూ
రాంకిత మోక్షైకరూప! యాలింపుమిలన్॥ 20

మూడక్షరములకూడిక,
మూడుగుణంబులకలయిక, ముమ్మూర్తులుగాన్
మూడారు విద్యలుబుకన్,
పొడిగ యోంకార మయ్యె భువన త్రయిలోన్. 21

శబ్ద మర్థమై, యర్థమే సరసులమది
జ్ఞాన పుష్పమై, యానంద సౌరభంబు
ప్రసరమంద, జోతిర్లింగ వైభవంబు
కాంతికణికలైవర్షిని క్రమ్ముకొనియె॥ 22

చూచువారల కన్నుల చూపుచెదరె,
తలచు వారల తలపులు స్తబ్ధమయ్యె,
పరిసరాంతర ప్రకృతి కన్పట్టదయ్యె,
బాలునిన్ చూచు వృద్ధులే ప్రతిమలైరి॥ 23

రంగురంగుల దివ్యహారంబుదెచ్చి,
శంకరగురు గళమున అర్చకుడు వేయ,
శక్తిపాతంబుచే సహస్రారుజీవ
యంత్రములు వెల్గె, ఛాత్రుల యాత్మలలరె॥ 24

నిదర్శనం

శంకరుడు దరినున్న రసాల వృక్ష
శీతలచ్ఛాయకేతెంచి, స్నిగ్ధసిత శి
లాతలంబుపై కూర్చొన, రాగరక్తి
చిదుము పదముల కడనిల్చె, శిష్యతతియు॥ 25

చిన్నవాడయ్యు విద్యల పెద్దయితడు
కనుకనే భగవానుడీకడకు మనల
బంపె, ఓంకారనాధుని ప్రభలు వెలిగె,
యితని మౌనమే మాశంకలింకజేసె॥ 26

కాని, యీ చిన్నవానిలోకజ్ఞతన్ గ్ర
హింపవలె, నింకయేరీతి యిహపరప్ర
వృత్తుల సమన్వయించునో, వృద్ధులెరుగ
కుతుకముబికియు ప్రశ్నింపగుండెలేక ॥ 27

తడబడు ముఖంబులన్వారి యెడద చదువ
శంకరునికనుల్ కరుణ విశాలమయ్యె
ప్రశ్నపుట్టుట జిజ్ఞాసి లక్షణంబు,
పుట్టు ప్రశ్నల దాచుట బుద్ధిగాదు ॥ 28

ఎన్నిచదువులు చదివినా, యెంతయున్న,
యెట్టివారైన, ద్వైత భూయిష్ట జగతి,
పాదరసమురీతి చలించి బాధపెట్టు,
చిత్తసంశయ వృత్తుల చెరపదగునె? 29

సంశయాత్మునకేరీతి శాంతికలుగు?
శాంతిలేదేని లేదు మోక్షమన గురుడు,
శిష్యలుత్సాహ పూరిత చిత్తులగుచు
ఇలయుపాధేయమేదియో దెలుపుడనగ॥ 30

గురువచనముపాథేయము, గురువెవడన
శిష్య సంరక్షణార్థమై జీవితంబు
నెల్లశ్రమియించు తత్త్వజ్ఞు డేది విషము?
గురుతిరస్కారమేకాలకూట విషము॥ 31

విషముకంటెయేది విషము? విషయసుఖం
బెవడు దుఃఖి? విషయ విహతుడు, మహి
దుఃఖ దూరుడెవడు? తొలగని సిరి అను
కూలవతి సతిగల శీలధనుడు॥ 32

ఇద్ధరన్ గృహస్థుడెవ్వడు? విధ్యుక్త
యజ్వ, యేదియజ్ఞ? మఖిల జనుల
కీప్సితంబు కూర్చుకెలసంబు, యజమాని
చెలియెవరు? పవిత్రకుల వధూటి॥ 33

సకల సుఖములకేది బీజంబు? పూర్వ
పుణ్యకృత్యము, యాతన బుట్టుటెటుల?
పాపకార్యాన, యెవ్వడు భాగ్యవంతు?
డభవునహరహం బర్చించునెనఘ మూర్తి. 34

ముక్తి కల్గుటెట్లు? ముకుందభక్తి వలన
అముకుందుడెవ్వం? డవిద్యాజలధిని
దాటతోడ్పడు హరి, అవిద్యయననేమి?
ఆత్మ(గప్పుతమం బవిద్యయగుచుండె. 35

శోకతప్తుడుకానట్టి సుఖి యెవండు?
క్రోధమడగార్చుతృప్తుడు, కువలయేశు
డెవడు? ప్రజల కాహ్లాదంబునిచ్చురాజు
శునకమననెవ్వడు? ఖలుగొల్చుపతితుండు॥ 36

## నిదర్శనం

ఎవడు మాయావి? ఆపరమేశ్వరుండు,
ఇంద్రజాల సదృశమేది? యీ యనిత్య
చలిత మిథ్యా ప్రపంచంబు; స్వప్నతుల్య
మీ జగము, సత్య మాబ్రహ్మమే యెఱుంగ॥ 37

ఏది మిథ్య? జ్ఞానంబుచే నింకున దిల
తుచ్ఛమేది? కుందేటి కొమ్ముచ్ఛుపడని
దేది? మాయ, కల్పితమేది? ఎదుట దోచు
చంచలంబగు మిథ్యా ప్రపంచమరయ. 38

పారమార్థికమౌ సత్యవస్తువేది?
అద్వయ బ్రహ్మ, మజ్ఞతకాదియేది?
అదియనాది, పోషకము? ప్రారబ్ధకర్మ
అన్నమేమిచ్చు? నాయువు నందజేయు. 39

అన్నదానార్హుడెవడు? క్షుధాతురుండు,
అర్చనాయోగ్యుడెవ్వడీ యవనికెల్ల?
భగవదవతారు, డాభగవానుడెవడు?
హరిహరాత్మకమౌ మహేశ్వరుడొకండె॥ 40

ఎవరు ప్రత్యక్ష దైవమీయిల నరునకు?
జనని, గురుమూర్తి యెవ్వడు? జనకు, డమరు
డెవడు? ధాత్రీసురుం డాతడెట్టివాడు
జ్ఞాన కర్మలనుష్ఠించు కర్మయోగి॥ 41

మద్యసదృశమైన మాదకమేది? స్నే
హంబు, చోరులెవ్వ? రైహికవిష
యంబులు, భగవల్లియననేది? తృష్ణ, శ
త్రువన? తన్నుదానె దూరునరుడు॥ 42

నిదర్శనం

ధరణిపై భయ ప్రదంబేది? మృత్యువు
గ్రుడ్డికంటె పెద్దగ్రుడ్డి? కామి.
శూరుడనయెవండు? సుదతిక్రీగంటిచూ
పువలతగులు కొనని పురుషుడొకడె॥ 43

అమృతమువలె కర్ణంబుల కధికపాన
యోగ్యమైనది యేది? యీ యుర్విపైన
సదుపదేశము, గౌరవం బొదవమూల
మేది? యాచింపకుండుటే యెన్నడైన॥ 44

గహనమైనదేది? కలకంఠి చరితంబు,
చతురుడెవడు? స్త్రీకి జంకనివశి,
దుఃఖియెవడు? తృప్తిదూరుడు, లేబరం
బౌట? నీచులకడ యాచనంబె॥ 45

జీవనమనయేది? చిద్రంబుగానట్టి
బ్రతుకు, జాడ్యమేది? చదివియు గుణ
మాచరింపకునికి, అవనిలో ప్రాణుల
కేది నిద్ర? మూర్ఖ హృదయుడౌట॥ 46

నరకమన? పరాధీనమైనడచుట; సుఖ
మేది? సంఘపరిత్యాగ మేదిచేయ
దగునరుడు? భూత తతికి హితంబు, సకల
జీవకోటికి ప్రియమేది? జీవములిల॥ 47

భగవదారాధనమొసంగు ఫలములేవి?
చూడసాలోక్యసామీప్య సుకృతికొనుటె
ముక్తియన అవిద్యాక్షయంబు; నిగమముల
యోని? ఓంకార మొక్కటే యుర్విపైన॥ 48

నిదర్శనం

ఆయనుభవామృత వాక్కుల నాలకించి
వటుని రూపంబులో నున్న బ్రహ్మమితడు
పరిణత జ్ఞానియౌ జగద్గురుడెరుంగ
ఈ హితమిత ప్రియోక్తులే యిలకురక్ష॥ 49

శర్వుండు సదారాధ్యుడు
సర్వజ్ఞుడితడని ఛాత్రసంఘమ్మునతుల్
ఉర్విన్పడిసేయగ నుదయ
పర్వతశిఖరాలమెరసెబాలేందుకళల్. 50

# ఆత్మదర్శనం

దేహమే లేక సేవించు తెరువులేదు
హృదయమేలేక ప్రేమించు టెరుగబోము
ఆత్మయేలేక యనుభవంబందలేము
చెడుతనుమనంబులు పరాత్మచేటువడదు

## ఆత్మదర్శనం

నిర్వికారనిరంజన నిరతి మెరయు
శంకరుడు మది గురువరున్ స్మరణ సేయ
దిక్కులన్నియు వెలుగొంద దివ్యతేజ
మంధిగోవిందగురుడు ప్రత్యక్షమయ్యె॥ 1

సంభ్రమాశ్చర్య చకితులై సకల శిష్య
బృందమత్యంత భక్తి గోవిందగురుని
కెఱగ నామహాత్ముండు శంకరుని జూచి
అన్న! నీశక్తిగంటి నిన్నందుకొంటి॥ 2

నీవు ఓంకార నాథుని నిస్తులప్ర
భామహత్వంబు పొడగన్న వరవటుడవు,
నిన్నునంటదహంకారమెన్నటికిని
యోగ్యుడవు నిర్గుణ బ్రహ్మయోగమంద॥ 3

అదియు నీకు సిద్ధించు నత్యంత శీఘ్ర
కాలముననే జగద్రక్షకై జనించు
చంద్రమౌళివి శారదాశక్తి యుపని
షన్మతము వెల్గ సమయమాసన్నమయ్యె॥ 4

ప్రత్యక్షానుభవమలర
నిత్యము శంకించు శిష్యనిచయంబునకున్
సత్యజ్ఞానంబులొసగు
స్తుత్యర్హగురుండవైతి సూనృత చరితా॥ 5

ప్రకృతిఘటన మౌనవ్యాఖ్య పాఠములయి
అనుసరించు ఛాత్రుల సంశయములడంచె
పలుకులేమంత్రమై శిలన్ బ్రహ్మసేయు
నడనుడులె మహాత్ముల లక్షణం బుదెలుపు॥ 6

గురుదీక్షాహోమంబుల
వరుస క్రమమందక యతి పదమందు మహ
త్తరచరితుండవు జన్మాం
తర సంస్కృతి జీవుల కిలనైజంబనుచున్॥ 7

రమ్మటంచుతానాత్మ గృహంబుకేగ
గురుని పాదాల బట్టి శంకరుడునడచె,
క్రమ్మెకారు మేఘంబులాకాశమందు
పెళపెళార్భటిన్ దిక్కుల పిక్కటిల్ల॥ 8

గుహనుసేరి యోగవహుడయ్యె గోవింద
గురుడు, బాల గురుడు గుహాముఖాన
కేలుమోడ్చినందివోలె నిల్చె భగవ
ద్గురు పదంబులాత్మవిరియుచుండ॥ 9

మిట్టపల్లంబులేవియో చెట్టుచేమ
లెచటనో! కొండకోనలే యెఱుకవడక
అంధకారపరీవృతంబయ్యెనఖిల
జగతిమాయావృతంబైన స్వాంతమనగ॥ 10

మెరసెచపలాలతలు, మిరుమిట్లుగొలుప,
వీచెపెనుగాలి ఆశ్రమ వీధి చెదర
అగ్గిపిడుగులు గుండెలనదరగొట్టె
గాలివాన మృగాటవుల్కలచివైచె. 11

కరిశరీరబలము, పులిచమత్కృతియు, సిం
హంపుటాత్మశక్తి, హద్దులచెడ
ప్రకృతియే భయంకరంబై విజృంభించె,
పలుకతరమె పామరుల వెతలిక॥ 12

గురునికీబాధలేవియు నెఱుక బడవు,
సన్నిధానంబులో నిల్చు ఛాత్రమణికి
బాధలంటియు, నంటవు భక్తిగరిమ,
బాధలన్నియు జీవుల పాలివయ్యె॥

రెండు మూన్నాళ్లు గడిచినా, కుండపోత
గ, బడుజడివాన తగ్గముఖంబులేదు,
నర్మదానది ప్రళయతాండవము చేసె,
చెంతగల జీవుల స్థితిచితికిపోయె॥

సాలవృక్షంబులూగె దయ్యాల వోలె,
గుడ్లతో గూటిపక్షులు కుప్పకూలె,
గుడిసెలన్నియు నీటిపై గొడుగులయ్యె,
నారికేళముల్ బుడగలై నదిని దేలె॥

నురుగుల్ గ్రక్కుచు, నర్మద
ధరణీజంబుల పెకల్చి, దరినున్న గృహో
పరి సుమవాటికలన్, చిం
దరవందరజేసి, గురుని దరి, దరియంగాన్

హాహాకారమ్ముల, నది
కాహుతియగుజీవులగని, యతికారుణ్యో
త్సాహ ప్రచలితుడై, గురు
నూహించుచు శిష్యుడురికె, 'యుబికెడినదికిన్

మానసముజలాకర్షణ మంత్రమున్ జ
పింప, గంగాధర అగస్త్య కృత్యముల ద
లచి, కలశమానకట్టగ నచట నిలుప
నర్మదోర్మిక లాకమండలి నడంగె॥

పుట్టకురికెడి పడగల భుజగమనగ
అలలరేగు కల్లోలిని యార్భటు లడ
గారి యోగకమండలిన్ జేరెనౌర!
సిద్ధ పురుషుల మహిమలు చెప్పతరమె? 19

అఘటన ఘటనా ఘటికుల యాత్మశక్తి
బుద్ధికందదేగాని, ఆసిద్ధినరయ
ప్రజకు పరిణామ భాగ్యమై పరగు నెపుడు,
క్రమముగ నుపశమించె నాగాలివాన॥ 20

గురుగోవిందుని కన్నులు,
నరవిచ్చెడు మొగ్గలయ్యె హసనోన్ముఖుడై,
మెరసెడి శంకరబాలుని
బరిచర్యల నెరిగె భావిభాగ్యోదయముల్. 21

విరజహోమమిదియె, వ్రేల్చుమా కర్మల
తాది సూత్ర శిఖల యని గురుండు
విశ్వగురునిజేయ వినమిత శంకరున్
వెలుగుదారులనడపింప నడిచె॥ 22

అదిశుభాశ్వీజ పౌర్ణమి, యర్ధరాత్రి
సైకత స్థలిన్, చిఱుత నాసాగ్ర దృష్టి
నాత్మబల మావహింప, పద్మాసనస్థు
జేసి, శిష్యచూపులచూపుచేర్చె గురుడు. 23

ఏమికన్పించునో వచియింపు మనగ
ఈచరాచరాత్మక సృష్టియెల్ల మాసె
కాని మీరూప మొకటియేకంట నిలచె
ననగ "అదియు నీ వైతివయ్యా" యటంచు. 24

శిష్యుని శిరంబుపై కుడిచేయి నిడుచు
ప్రణవముపదేశమున్‌సేయ, బాలుని మది
కట్టువడె, ముఖము వినూత్నకాంతిదనరె,
గురునిశక్తులు, శిష్యుని గూడుకొనియె॥

గూటి పక్షులు గూడునకూడుకొనియె,
నీడలేని చైతన్యమైనెగడె, నతడు
మింటిమినుకులదాటి బ్రాహ్మీపథాన
హృదయకుహరాంతరజ్యోతిలీనుడయ్యె.

నిర్వికల్ప సమాధిలో నిల్వ ఆత్మ
షోడశకళా ప్రపూర్ణుడై చూడ నితడు
పూర్ణపురుషుడై మనుగాక పోదమంచు
గురుడు గోవిందుడాత్మీయగుహనుజేరె॥

మూల పృథివి, మణిజలాల, స్వాధిష్ఠాన
మగ్ని హృది సమీరమడచి, శుద్ధ
మంబరము, భ్రుకుటి మనంబు జీల్చి, సహస్ర
మందు శంకరాత్మయచలమయ్యె.

గాలిబాలుని కదలింపగాక నిలచె,
వెలుగు వెలిగింపనేరక విఫలమయ్యె,
నీరునిరుపయోగంబుగా చేరదయ్యె,
ప్రకృతికందని ప్రభుడయ్యె,బాలుడంత॥

కన్నులుండియు, కాంచనికాంతిమయుడు,
చెవులు గల్గియు, విననిప్రణవరతుండు,
ప్రాణముండియు నోగిరంబందనివ
శంకరుండంచు ఛాత్రులు చకితులైరి.

గువ్వలీతని చంకల గూళ్ళు కట్టె,
పాములీతని శిరముపై పడగలెత్తె,
దంశకీటక వ్రాతమీతనువు తొలచె,
కటకటాయని శిష్యసంఘుంబు వచ్చి 31

గుఱుదేవా! శంకర గురు
డిరువదినాళ్ళయ్యె, సలిలమేనియుగొన డ
చ్చెరవగు సమాధి మునిగెను,
పురుగులు పులుగులు శరీర భోక్తలు కాగాన్. 32

ప్రాణవాయువు లాయస్తిపంజరమున,
ఉన్నవో!లేవో! సందేహముద్భవించె,
ఆలసింప హాలాహలంబౌ నమృతమె,
కావుడోయని గద్గదకంతులగుచు. 33

కాలుసేతులాడుటలేదు, కనికరించి
శంకరగురు చూడుడని, ఆశ్రమ జనాళి
మొఱలిడ, గురుండు తలపులో ముందుచూచె,
నిశ్చల సమాధి సంస్థిత నిర్వికారు. 34

శంకరకుమారుదక్షిణ శ్రవణమందు,
బిగ్గరగ హరిః ఓమ్మని బిలువ, ప్రణవ
నాదము తరంగమై హృదంతర సరోరు
హ ప్రభున్‌తాకె, కన్నాపలార్చెనతడు 35

వెంటనే కమండల జలంబెత్తి, తలకు
జల్లి, నోర్దడపగ, గురునల్ల దెలిసి,
న,న, యనుచు నాల్కతడబడ, నమ్ర శీర్షు
డగుచు, గోవింద చరణాబ్జమయ్యె చూపు. 36

చిన్నవానిని గుండెల జేర్చుకొనుచు,
ఎత్తుకొని వచ్చె నింటి కీదృశ్యమరసి,
ఔర! గురుశిష్యబాంధవ్యమమృత బంధ
మనుపమంబని, పరిజనంబాడుకొనగ॥ 37

పరిచర్యల్సేయగ శం
కరునకు, గోవింద శిష్యగణమెల్లన్, స
త్వరమతడు కోలుకొనె, సం
బరమున ఆచార్యుడరసె బాలబ్రహ్మన్. 38

దర్భకొనగోటి నీటి ముత్యాల నింద్ర
చాపముంజూచి, నవ్వును శంకరుండు
నింగి తాకెడి నేలపై నిశ్చలుడగు,
విరుల తారల జూచుచు పరవశించు॥ 39

పూలు గోయుచు పాదచెంత బొమ్మయగును,
స్నానమొనరించు నభిషేకజలముల, దివ
ముగని హరినామ కీర్తనముసలుపు, వడ
గండ్ల శివశివాయని, పాడి, గంతువైచు. 40

కాకిముట్టిన, అన్నోదకంబులే మ
హా ప్రసాదంబని, ప్రీతినారగించు,
కోకిల స్వామికిన్ మ్రొక్కు, గురువరుడని
కుక్కుట ధ్వనికి సమాధి కూడుచుండె॥ 41

అరుణసంధ్యల, అంబయంబా యటంచు
ప్రాక్ప్రతీచీ దిశలబడి పరువులెత్తు
ప్రకృతి జూచుచు నొక్కొక్క పరియతండు
మూకబధిర పంగ్వంధుడైపోవుచుండె॥ 42

బాలుడని కొందరాతని బరిహసింప,
పిచ్చివాడని కొందరు విసుగుకొనిరి,
చేష్టలగని, భూతగ్రస్త చిత్తుడంచు,
దవ్వుదవ్వుల సహచరుల్దప్పుకొనగ. 43

ఔర! జన్మలు తపియించినా ఫలింప
కష్టతరమైన యీ నిర్వికల్పయోగ
మబ్బుటే వింత? అబ్బెనా, హానిగాక
మేనునిల్చుట దుష్కరంబౌనుగాదె; 44

ఇంతచిన్న వయస్సునం, దీతడిన్ని
యోగ శక్తుల సాధించుటూహపట్ట
నేరని మహాద్భుత, మితండు నిఖిల లోక
రక్షకై బుట్టు శివుడంచు ప్రభుగురుండు. 45

అన్న! శంకర, శంకరయ్యయని, చేర
బాహ్య సంస్మృతి గోవింద పాదుజూచి
పలికె దేవ! నన్నానందవాటికరుగ
నిమ్ము, తాళలే నీవియోగమ్మనంగ. 46

నీకు యోగవియోగమ్ములే కలుగవు.
ఈ యుపాధియున్నంతదా, కీవు, సాక్షి
వై, జగద్విధికనువుగా పాటుబడుదు,
బాహ్యమున స్థిత ప్రజ్ఞుండవై బ్రతుకుమ!॥ 47

కారణపురుషుడై బుట్టు, జ్ఞానివీవు
వేదముల విభాగించు నా విష్ణుమూర్తి
బ్రహ్మ సూత్రముల్సేకూర్చె, వాటికి రచి
యింప భాష్యమున్, నీరాక కెదురు చూచె॥ 48

## ఆత్మదర్శనం

యుగములన్ నాసికన్‌బట్టు యోగికరణి
నర్మదానదిన్ నిజకమండలినడంచి
ప్రజల పరితాప మడగార్చువాడె, బ్రహ్మ
సూత్రభాష్యమున్‌రచియించుసూరియంచు. 49

శివుడుబల్కిన బల్కులు స్థిరమొనర్ప,
కారణికుడై జనించిన కర్మయోగి,
బదరికావని కేగుమా భాష్యరచన
కాపవిత్ర స్థలమె సహకారినీకు॥ 50

పులకలతో, గురువాక్యం
బులశంకరుడాలకించి, ముందునకేగన్
సెలవని, గోవిందపదం
బుల ముట్టె వినూత్న శక్తి ముప్పిరిగొనగాన్. 51

దుర్గమారణ్యభూముల తొలచుకొంచు,
సాగనదివోలె, ఆచార్యశంకరుండు,
నింగి విహరించు నీలాల నేల జూచె,
బ్రహ్మసూత్రముల్ బదరికన్ బ్రతిరవింప॥ 52

ఎదుట గుత్తులు గుత్తులై వృక్షపుసిరి,
కొండదేవరన్ పూజింపకూడెననగ,
సృష్టిమెరసె, అఖండ దృష్టికి యనంత
సౌఖ్యముల్‌గూర్ప, శంకర స్వాంతమలరె. 53

హిమగిరి సుందర దృశ్యము,
లమలిన గంగా.జలోర్మికావనముల్, ఆ
హిమకర దినకర కరముల,
సుమనోజ్ఞంబైన సృష్టి జూచె, నతండున్. 54

నరనారాయణులిరువురి
చిరతరపుణ్యము ఫలింప, శిఖరాకృతులై,
సురుచిర సుమసౌరభసం
భరితాశ్రమమై, బదరిక ప్రమదంబయ్యెన్॥ 55

అచటి యలకనంద, యా దివ్యపురుషుల
అద్భుత చరితంబు నాలపింప,
జీవలోకమెల్ల చిత్రమై నిల్చె, న
చేతన ప్రకృతి, సజీవమయ్యె॥ 56

సురలేనరలోకపు సృ
ష్టి రహస్యము లెరుగ, ధవళ శృంగములై, కొం
దరు, నదులై కొందరు ది
వ్యరసావిష్కృతి చరింతురనుదినమిచటన్. 57

బదరీవన పర్వత సం
పదలెంతని, పొగడవచ్చు, వాడని విరులన్,
వదలని సౌరభముల్, మది
చెదరని హరిచాపరుచులు, శీకరఝరులన్॥ 58

గురుగోవిందుని వాక్కులు,
పరమేశ్వరదివ్యవాణి, ఫలియింపగ బం
ధురగిరిగంధము, శ్రుతి వా
క్యరసామృత ధారలనుభవామోదముగాన్. 59

మఱుగై సూత్రాక్షరములు,
చెఱగని భావములు రూపుసేకొన, గుండెల్
కఱగుచు కన్నుల నీరై
యురలగయెద, యుండి యుండకుండె శివుండున్. 60

ఆపరాశరాత్మజుడు, సూత్రార్థమగుచు,
అక్షరాకృతిముందె, సాక్షాత్కరింప,
దేశకాలగతులకేయతీతమగు, ఋ
తంబె తానై, గురుడు రసాద్వైతియయ్యె॥ 61

తానొకడె సత్యమయ్యె, చైతన్యమయ్యె,
అనుభవానందమయ్యె, సూత్రార్థమంత
కంత నిత్యమై, సుందరంబై శివ ప్ర
దమయి, భాష్యమయ్యె, తనకు తాదెలియక॥ 62

సకలోపనిషద్వాక్యము
లనేక ముఖమున్ కుదుర్చ, బ్రాహ్మీరూపం
బొకటై స్థిరముగ, వ్యాస
ప్రకటిత సత్యంబె ప్రథమ భాష్యంబయ్యెన్. 63

భగవద్గీతకు, విపులం
బగు విష్ణు సహస్రనామ పంక్తికి, శిష్టం
బగునుపనిషద్దశికి, సే
యగ ప్రస్థాన త్రయమన వ్యాఖ్య గురుండున్ 64

అణుగతాంతర కక్షలందాడుకొంచు,
చుట్టునాకర్షణ ప్రభన్ జూచె, దాని
కేంద్రపు టనంత జీవశక్తిని కనుగొనె,
అటనె పరిపూర్ణమౌ బ్రహ్మమాత్మనెరిగె॥ 65

సతతహరిత సంభరిత సస్యాంకురముల,
మృదుసమీరతరంగమాలికల, జలజ
లప్రపాత శీకరములర్కారుణ ప్ర
భల లయగలిపి శ్రుతి జగద్గురుడు పాడె॥ 66

నీలిమేఘాల, అరుణరాగాల, యంబు
జోదరపదాల తానమృతోపమసిత
కిరణమై, రసతంత్రియై పరమ హంస
యై శ్రుతిపదాల పాడుచునాత్మమఱచె॥ 67

గురునాజ్ఞ సూత్రభాష్యము
పరిపూర్ణమొనర్చి ఋషులు ప్రణుతింప, జలాం
తరమగ్నున్నారాయణు
తరచి ప్రతిష్ఠించె, విష్ణు తత్త్వంబిలపై 68

నిఖిల నిగమాగమంబులనెమరు వేయు,
ఆమహావాక్యముల బరమార్థమరసి,
బ్రహ్మమేనంచు తలచుచు, బ్రహ్మమయ్యె
నాతడు భ్రమర కీటకన్యాయ సరణి॥ 69

జీవలోకము బ్రహ్మము, చేతనమగు
ప్రజ్ఞ బ్రహ్మ మచేతన ప్రకృతి బ్రహ్మ
మేను సర్వము, బ్రహ్మంబె, యెడమడంగె
మూక బధిర పంగ్వంధుడైపోయె శివుడు॥ 70

# సుదర్శనం

ఎటనో మోక్షం బని న
మ్ముటకంటెను బ్రతికినపుడె ముక్తిశ్రీ
ఘటితానందంబిచ్చెడి
ఘటశాసియెభ్రమరమయ్యె జ్ఞానాటవిలోన్

లోలోగల ఆనందం
బీలోకమ్మునవెలుంగ నెదుటన్ తన్నో
లీలామానుష రూపుని
గా లాలింపన్ కుదించె కాశీవనమే॥ 1

ఈ కాశీ క్షేత్రంబే
నాకాయువుపట్టు నన్నునడిపింపగజ్ఞా
నైకధురీణభవాని, య
నేకాకృతుల ననునిలుప నిలచిన దిచటన్ 2

స్నానసంధ్యల శుచిసేయ జాహ్నవి, బలు
వెల్లులరవి, విఘ్నేశుడు విఘ్నమడప
వ్యాప్తినొనరింప మాధవ స్వామియంచు
శివమె శంకరుండని ముందుచేర గానె॥ 3

కాశీనగరంబునబుధు
లాశీర్బలమున్ గొన, కమలాయత నేత్రుం
డై, శంకరయతిజూచె, స
దాశశ్వజ్జనపదంబు, ధర్మపదంబున్. 4

వారణ అసి, నా రెండు జీవనదులనడి
బొడ్డునంగల యందాలభూమి వార
ణాసి, యదిసురారామమానంద ధామ
మమల గంగాస్రవంతీ విహార భూమి॥ 5

ముక్తి కాంతా ప్రభావంబె, ముద్దులొలుక
కాశిగాకంటికిన్దోప, కరములెత్తి
మ్రొక్కె, శంకరుండటకాలుమోపుచు, నగ
రాధిదేవతనన్నపూర్ణను తలంచె. 6

గంగశీతలోర్మికాశీకరంబుల,
తనువు పులకరించె, తల్లియమృత
స్పర్శదోచె, నాత్మసౌఖ్యమజ్ఞాతమై
తెలియనిపదమందు దేల్చెనతని॥ 7

సకలపాపముల్ జాహ్నవీజలకణాల
స్పర్శ మాత్రలో బరిహారం బౌనటంచు,
నిలచి, పిలచెడి పిల్పువిని, నిజమంచు
బిందు మాధవ స్వామిని వినుతిసేసె॥ 8

ముందు భాగీరథీ నదిన్ మునిగి, బుద్ధి
కందని పురాస్మృతులెనాత్మనవఘళింప
స్వప్నమందెప్పుడో చూచు పదమనికనె
డుంటి విఘ్నేశు కర్ణికామంటపమున॥ 9

తల్లిబిడ్డవు నిన్ముందు దలపకుండ,
కార్య విజయంబు కాదెంత ఘనులకైన,
పొట్టకున్ మ్రొక్క, తొండంబు గుట్టు దెలుపు,
పూర్ణరూప! కావవెయని మ్రొక్కెగురుడు. 10

ముందుకేగుచుండ, ముసిముసి నవ్వుల
కాలభైరవుండు కానుపింప,
అంత్యకాలమందు, నఘరాశి తలపులో
మాన్పువిభుడవని, నమస్కరించె॥ 11

అన్నపూర్ణామహాదేవి నరయగానె,
నేల సాష్టాంగముగబడి, బాలుడంబ!
ఆదిభిక్షువు భైక్ష్యమే యడగజేసి
మగనిలాలించి లోకాలమనుతువీవు॥ 12

అంచుముందుకేగ, యానందతత్త్వమే,
అష్టమూర్తియగుచు, నాత్మకాగ
పులకలెగయబాష్పపుష్పాలనర్చించె,
జగతిగాని జగతి, శంభుజూచె. 13

దేవ దేవా! మహాదేవ! దివ్యతేజ!
నిన్ను నెంతని యెట్లు వర్ణింతునయ్య,
వేదనాదాలకందని విభుతనీది,
ఆగమంబుల చిక్కని అంతునీది. 14

ఉన్నదొక్కటే వివిధ రూపోద్భవంబు,
లన్నిటికి చేతనాప్రదంబౌచు, నిలచి,
విశ్వమై, విశ్వమయుడవై, విశ్వనాథు
డైతి, జగదనుస్యూతికి స్థాణువైతి॥ 15

కలడుకలడనువానికి కల్మినీవు,
లేడులేడనువానికి లేమి నీవు,
నిన్ను నిత్యర్థమున్ సేయ యెవని కగును?
అష్టమూర్తివో యాత్మవొ యరయతరమె? 16

ఆత్మయే నీవు, బుద్ధియే యంబ, ప్రాణ
ములెచెలుల్, దేహమ్మె గృహంబు, భోగరచన
యే సపర్య, నే సలిపెడి యెల్లకార్య
ములు శివా! భవారాధనంబుగదలంతు॥ 17

శివుని యభిషేకమున భేద చిత్తముడిగె,
మాధవస్మరణ, మనంబు మధురమయ్యె
గణపతిన్ అఖండ బ్రహ్మగాంతు, కర్మ
సాక్షిచే కర్మతెగు, గంగ నఘముతొలచె. 18

పంచబ్రహ్మ ప్రాసా
దాంచిత, హరిహర వినాయకాంబారవులన్,
పంచాయతన పూజల శా
సించెడి కాశి, నిఖిల జన సేవ్యంబయ్యెన్.

శంకరుడొకనాడు చాటగ తత్త్వంబు,
నచటి యాస్తిక ప్రజాళి చేరి,
కాశి ఘనతయేమొ! కనికరింపుడొయన,
గురుని దలచి పలికె గురువరుండు॥

చపలమడచి, శాంతి సమకూర్చు మణికర్ణి
కాపదము, తమమను కలుషమడచు,
జ్ఞానగంగ రెంటిగలుపు పదమెకాశి,
ఆత్మబోధ రూపమైతి నేను॥

తనువు తనువును గృహముగాదలచుబుద్ధి
యే భవాని, సర్వగతుడై యెల్లనెఱుగు
ప్రత్యగాత్మయే శివుడీయుభయుల కూర్చు
కాశి, కాశీ స్వరూపినైకదలుచుంటి॥

దేహమే కాశి, జ్ఞానమే త్రిభువన జన
ని, భయభక్తులే గయ, గురుని స్తుతించు
టే ప్రయాగ, తురీయుడే ఎఱుగ ప్రత్య
గాత్మ, జనమనస్సాక్షి విశ్వాధికుడగు

అన్వయ జ్ఞాన రూపంబునై వెలుంగ
కాశి, యిదియె సర్వమును ప్రకాశమంద
చేయు, నాత్మజ్ఞుడిందు కాశీ స్వరూపి
అనవసరమిక అన్యతీర్థాలకేగ॥

శమదమాదియుపాసనాసాధనముల,
మది, నెవండు స్థిరముగ నిర్మల మొనర్చు,
వాడెపో గుర్వనుగ్రహ ప్రాప్తినందు,
అనుభవ జ్ఞానియే బ్రహ్మమగుననంగ॥ 25

బ్రహ్మమననేమి? జీవుడెవ్వడు? జగంబు
లెట్లుకలిగె దేవా! వివరింపుడనగ,
శ్రుతులె యూహింపనేరక స్రుక్కుచుండ,
బ్రహ్మమును గూర్చి చర్చింప వశమె మనకు? 26

అనుభవంబున కందినంతాడు వాడ,
సచ్చిదానంద మవ్యక్త శక్తి, బ్రహ్మ
మదియె, నన్ను మిమ్మఖిల బ్రహ్మాండముల సృ
జించి, రక్షించి, తుది సంహరించుచుండు॥ 27

ఆ ప్రభావ మూహాతీతమై, యనంత
రూపములదాల్చు, నద్వయ దీపమది, య
పార సౌఖ్యాంబురాశియై, బంధ రహిత
మై, అఖండమై, యచ్యుతమై వెలుంగు. 28

అస్తి, భాతి, ప్రియంబె, బ్రహ్మంబెరుంగ,
సచ్చిదానందమే సదా, సర్వథా, స
మస్తమై, నామ రూపాల మనకు దోచు
కాన యస్థిరంబున తిరమైనదదియె॥ 29

అదియె, తనమాయచే గుణత్రయప్రభేద
మంది, జీవేశ్వర ద్వయంబయ్యెనంత,
తాను జీవియై మాయనిస్తంద్రకర్మ
బద్ధ జగతియై జీవుల భ్రాంతినలుపు॥ 30

ఒకటినే రెండుగా చూపు, నున్నదాని
ని మరపించుచు, లేనిదానిని కనులకు
కట్టచేయు, మాయయె కనుకట్టు విద్య
సృష్టికీ విలక్షణ శక్తి స్రష్టయయ్యె॥ 31

గుణగణాత్మక ప్రకృతిచే కూడి బ్రహ్మ
మీశ్వరుండై, జగంబుల సృష్టిచేసె.
జగతియందున్న జీవులీశ్వరుని ఆత్మ
జులయి మాయచే జగమున నలుగుచుండ్రి 32

ప్రకృతియే మాయ, గుణవికారంపుయోని,
తద్గుణంబులే పాశమై తగులుకొనగ,
పురుషుడే జీవియై గుణంబుల కనువుగ,
ఉచ్ఛనీచ జన్మంబుల నుర్విదాల్చు॥ 33

భ్రాంతియున్నంతవరకు ప్రపంచముండు,
భ్రాంతితొలగిన జీవుడే బ్రహ్మమగును,
అంతనీవు నేనను భేదమంతరించు,
ఏకమేవాద్వితీయమై యెసగు బ్రహ్మ॥ 34

బ్రహ్మమొక్కటే, మాయావివర్తమగుచు,
జీవజగములే యెదుట భాసించు, నింద్ర
జాల మీభిన్న భిన్న రూపాలనమ్మి,
జన్మ జన్మల బడిజీవి సతమతమగు॥ 35

దృశ్యమగుమేను, భౌతిక మింద్రియములు,
వివిధ మీప్రాణములు, చలంబీ మనంబు,
వికృతి బుద్ధి, క్షణక్షణంబివి నశించు
కాని, బ్రహ్మమొక్కటె నిర్వికారమయ్యె. 36

తన్నుదానెరింగిన జీవి తక్షణంబె,
బ్రహ్మమై వెల్గు నీజగంబంతరించు,
విధివశంబున దేహంబువిడువడేని,
ఆతడలరుజీవన్ముక్తుడై జగాన॥ 37

స్వపరభేద భావంబుల పట్టుబడడు,
విధివశంబగు కర్మల ప్రీతి నడపు,
నిత్య కల్యాణ సౌందర్య నిలయ జనని
యంచు,లోకమున్ కొలచి, తరించునిటనె॥ 38

దేహమేలేక సేవించు తెఱవు లేదు,
హృదయమేలేక ప్రేమించుటెరుగ బోము,
ఆత్మయే లేక అనుభవంబందగాదు,
చెడుతనుమనంబులు పరాత్మచేటు పడదు. 39

జీవేశుల ఐక్యార్థం
బై, విస్ఫుట శమదమాది వైరాగ్యవివే
కావృత సాధనముల, సం
భావిత మోక్షంబునందు ప్రాజ్ఞుండనగాన్. 40

మంత్రముగ్ధులైపోయిరి, మనుజులెల్ల
అందెవారుజీవన్ముక్తులైన రీతి
కొందరాకృపాదృక్కుల బందియైరి,
కొందరా సూక్తి సుధలనే గ్రోలుచుండ్రి. 41

కొందరాపక్వజీవికి వందనమన
కొందరనుభవ జ్ఞానులై కొందలైరి
కొందరాచేతనామూర్తి ముందె యొగిరి
యొగిరిగంతుల వైచిరి స్మృతి నెరుగక॥ 42

అంతమౌన మూర్తియై గురుండటనిల్వ
నున్న దున్నరీతి యుర్విని బడి
చేత రించుకొనుచుచిత్తంబులాజీవ
కోటి గురుని పాదపేటినిబడె॥ 43

చెక్కుచెదరని యతి చిత్రంబు మదినిల్పి
చలిత చరణులగుచు జనతకదల
ఒకడు మాత్రమచటనుండి చలింప కా
పాద పద్మయుగళి భ్రమరమయ్యె॥ 44

శంకరు, డతనిని కృపారసంబొలుకగ
పట్టి, లేపి, యెగాదిగ పాఱజూచి,
ఇంత వర్చస్సు చిందు నేత్రాంతరుచుల,
దైన్యమేరీతి నిండెనో, దలపకుంటి॥ 45

నిఖిల శాస్త్రవేత్తనీవ, నీ రూపు, వ
ర్తనమె చెప్పుచుండె, దాల్చుబొట్టు
కట్టు చూడ, నిచట బుట్టిన వానిగా
దోప, వెవడవీవు వేపలుకుమ!॥ 46

అనగ అనఘ! మీరలాడిన రీతి, నే
చోళ మండలాన, సుప్రసిద్ధ
ద్విజకులమున బుట్టి విష్ణుశర్మన, జన్మ
జలధిదాట, జగతినలయచుంటి.॥ 47

నామనంబు దెలిసి ననుదరిజేర్చు మ
హాత్ముడొక్కడెక్కడైన చిక్కు
ననెడి యాశయీడ్చుకొని వచ్చె నిందాక
నింకబంధుబలగ మెల్లమీరె॥ 48

స్వామియేనను కాపాడవలెనటంచు
ఆశతోకేలు మోడ్వగ యతని తపన
శ్రద్ధ భక్తి విరక్తి దలంచి శివుడు
అన్న! నీవు జగములేలు హరివిగావె? 49

నీవు నాకు నేను నీకు తోడైన అ
ద్వైతసిద్ధి జగతి బరిమళించు
నాస్తికమతములు వినాశమౌ యాస్తిక
ప్రజల కొక్కఅండలభ్యమగును॥ 50

ఇక సనందుడీవె యిమ్మహికి అన రు
ద్రాక్షభూతి దండ ధారియగుచు
కావిమడుగు గట్టి గ్రక్కున ముండిత
దై యతండు గురుపదాంఘ్రులంటె॥ 51

అంగిరసుడు గోర ఆనంద గిరి యంచు
మంత్రదీక్షకావి మడుగులతని
కిచ్చె గురుడు బల్విరీరీతి చేర యో
గ్యత నెరింగి వారి నాదరించె॥ 52

తనుమనజీవంబులకం
టెను బ్రహ్మాచ్యుతులకంటె నిరవధికుండై
తనుదెలిపెడి పరమేశ్వరు
డని గురుని గొలిచె సనందుడాత్మజ్ఞుండై॥ 53

ఒక్కనాడు గంగ యుప్పొంగ శంకరు
డొక్కదిక్కు శిష్యులొక్కదిక్కు
నైరి చిద్గురుడు సహాయార్థమై కూత
వెట్ట శిష్యులాత్మభీతి వడిరి 54

ఒక్క సనందుడు మాత్రము
ఉక్కోడి గంగాజలముల కురికె పదంబుల్
ద్రొక్కెడి కడపద్మంబుల
గ్రక్కున గంగ నిలిపె గురుకర్మునిగావన్॥ 55

గురుశంకర వదనోద్భవ
సరస్వతీ పాద పద్మ షట్పదుడు నిరం
తర యద్వైతామృత పా
నరతుండు గురు ప్రియుడు సనందుడు దరియన్॥ 56

సరభసానంద సంభృత స్వాంతుడగుచు
పద్మపాదా! యని గురుండు ప్రస్తుతించె
అవల గట్టునందున్న శిష్యతతితలలు
వంచిరి సనందు భక్తి యపారమంచు॥ 57

అన్నపూర్ణాసమక్షంబునందు శక్తి
దేవతారాధకుల్ గుణద్వేషి కుత్ర
కుంక, శంకరాద్వైతమున్ కూల్తు మంచు
కాలు దువ్విపైబడిరి వాక్కలహమునకు॥ 58

బాలుడు శివోహమన్న ఆ బల్కులవిని
వారు శివుడు శక్తి ప్రభావమున సృష్టి
గాంచు లేనిచో నాతడే కదలలేడు
హరిహర బ్రహ్మలర్చింతురంబననగ 59

హరిహర బ్రహ్మలీసృష్టియంతయు త్రిగు
ణాత్మకంబౌచు కల్పితంబైనమాయ
ఒక్క అనుభవ జ్ఞానమే నిక్కమనగ
మాయ మాయ బ్రహ్మమను నీమాటలెల్ల 60

జల్పమై బుద్ధికందని కాల్పనికము
కంటబడునీవుమేమీ జగంబులెల్ల
నిత్య సౌందర్య శివములై నిలచి యుండ
కల్పితంబను నీ వాక్కుకల్లగాదె? 61

జననియే లేక, నీవు, నీ యునికి లేదు,
తల్లియే లేక, బ్రతుకు చేతనముకాదు,
అంబయే లేక, ఆనందమందలేము
కాదని బలుక నీకు నాల్కయెటువచ్చె? 62

అన చిరునవ్వుల గురుడీ
యనుభవమంతయు, సుషుప్తియందేమైపో
వునొ! అప్పటి యనుభవమీ
యనుభవ మీరెండు నొకటి యౌనే తరచన్॥ 63

సృష్టియే దలపని సదా శివమచలము,
ప్రకటితానేక జగములు భ్రమ, సుషుప్తి
ననుభవించెడి శుద్ధ బ్రహ్మానుభూతి,
వాఙ్మనములకతీతమౌ వైభవమగు॥ 64

కారణములేక కార్యంబు కలుగదెపుడు,
కంటబడు కార్యరూపమేగతి తిరమగు?
దేశకాలయుపాధుల త్రెళ్లనట్టి,
కారణంబనుభవమన వారలంత. 65

శక్తిలేని శివుడు శవమన, కాదు కా
దది సమాధి, ఆమహానుభూతి
నాన్యతోభిలభ్యమౌ అవాఙ్మానస
గోచరమని బలుకు గురుని జూచి॥ 66

బదులు బల్కశాక్తేయులమదికి రామి
శంకరా! మూడు నాళ్ళయ్యె సలిలమేని
ముట్టవైతి, ఉపాహారముకొన చర్చ
నడచులేయన, "సరె" అని వెడలె గురుడు. 67

అంబ! యనివారు గర్భగృహంబు కురికి,
దేవి కాళ్ళపై వ్రాలి, వాపోవుచు, జగ
దంబ! యోడెద మన్న దుఃఖంబులేదు,
తల్లిదయయె, దప్పెనను చింత చితియయ్యె.॥ 68

జనని! మానిగమాగమ జ్ఞానమెల్ల,
పిన్నవాని యుక్తి యెదుట వీగిపోయె,
నిన్ను నమ్మి సేవించు, మాపున్నెమెల్ల,
చిన్నవాని లేనవ్వుల చిన్నపోయె. 69

ఈ యెల్లపాట్లు చూడగ,
నీయునికియె శంకయయ్యె, నిజమేదో! యం
దీయందని తత్త్వ మనగ,
నాయంబ కళయె యదృశ్యమైపోయె నటన్. 70

శంకరయతి గంగ జలకంబులాడి, ఆ
యాసమంది, దారికడ్డమనక,
గట్టుపైన, నొక్క చెట్టు నీడపరుండె,
భిక్షదేర శిష్యబృందమేగె॥ 71

అంతనొక్క మాతంగ కన్య, కలశోజ్వ
లాంగి, వచ్చి సామీ! దారికడ్డమయ్యె
అంఘ్రినొకియింత తొలగింపుడన, గురుండు
దాటిపొమ్మని సైగల దస్సితి ననె.॥ 72

హీనజాతిదాన, యెదుటబడుటె తప్పు,
కడవ నీటితోడ కదలుచుంటి,
దాటదగునె, మాకు తమయంతవారిని?
కొంతకాలు ముడుచుకొనుడనంగ 73

ఎవ్వరైననేమి? యే భిక్షలేక మూ
న్నాళ్ళ నుండి డస్సినాడ, కాలు
కదపశక్తిలేదు, కడచనుమన, శంక
రా! శివోహమంచు బ్రతుకచూతు॥ 74

కాని శక్తియే లేక యీకాలెకాదు,
కడకు తృణమేని భూమిపై కదలదంచు,
అన్నపూర్ణా మహాదేవియై రవంబె,
మంత్రమైపోవ, అంబ యంబాయటంచు 75

పిచ్చిగ పరువు ఫరువుల వచ్చి, దేవి
ఆలయంబున, బాష్పధారాళితోడ
మాత! మన్నింపవే, పరమాత్మ మహిషి,
యంచుకేల్మోడ్చి శంకరుండర్చసేసె. 76

సర్వమంగళ మాంగల్య శాంభవి, సక
లార్థదాయి, సర్వేశ్వరి, త్ర్యంబకి, కరు
ణాలవాల, నారాయణీ లీలగంటి,
ననగ భక్తులత్యాశ్చర్యమందిరంత 77

శంకరగురుండు దేవీ ప్రసాదులయ్యు,
మీరు ననువేరుసేయుట మేరయగునె,
ఈయనిర్వచనీయమౌ, యిద్ద భక్తి,
బ్రహ్మసిద్ధికి దోహదంబౌనుగాదె? 78

అంబ నుడుల అనుభవంబయ్యె సత్యంబు,
జగతినడనెఱుగుటె జ్ఞాని గుణము
సత్య సుందరముల, సమమయ్యె ద్వంద్వముల్,
చిద్విలాసమొకటె శివమెరుంగ॥ 79

శక్తి రూపాన యేదేవి సర్వభూత
సంస్థితాత్మయై, జగతి సాక్షాత్కరించు,
ఆ మహాతల్లి నహరహం బాత్మనమ్మ
తలచితరియించు వారలే ధన్యులిందు॥ 80

అంబయే బ్రహ్మమై జగంబలముకొనగ,
నీవు నేనను భేదమేనియతి కలుగు?
భేదమే కల్ల భక్తియే ప్రీతికరము,
భక్తి, జ్ఞానానురక్తిలో బ్రహ్మదమగు॥ 81

శక్తి బ్రహ్మ తత్వ సాధనకుపయుక్త
మౌచు, భక్తి భావమందజేయు
వ్యావహారికానుభవమెల్ల భక్తిలో
వ్యాప్తి చెంద, తానె బ్రహ్మమగును॥ 82

నమ్ముటే భక్తి, యెఱుగుటే జ్ఞాన, మెఱుక
వస్తు తత్వము, భక్తిభావ ప్రదీప్తి,
తన్నుతానెఱుంగుటయె, యద్వైత సిద్ధి,
సేవ్యసేవక భావమే చిత్తశుద్ధి 83

బ్రహ్మలీలావిలాసమే ప్రకృతి, దాని
మధుర పరిణామ భాగ్యమే మంగళమగు
శక్తి, యది చరాచర జగచ్ఛర్వమయ్యె
అన్నియును నేనను జ్ఞాన మాత్మయగును 84

బ్రహ్మమొకటియే శక్తి సంబంధమంది
సృష్టిసంస్థితలయలకు జీవమయ్యె,
సాధ్యసాధనా భేదంపు జాడలరయ,
జ్ఞానమొకటే యనంత కల్యాణ నిలయ. 85

మమతాహంక్రియలన్ దూ
రము సేయక, భక్తియెంత ప్రాజ్ఞులకైనన్,
సమకూరదు, స్వచ్ఛజ్ఞా
నముతో దేవినికొలచుట, నయమగుననగాన్ 86

నిజము నిజము దేవ! నినుచూడని యహంబె,
తగిన శిక్షనిచ్చె, తప్పుదెలిపె,
తల్లి బ్రహ్మమనెడి, తత్త్వంబు బోధించు
బాలగురుడె, బ్రహ్మ మయ్యె మాకు 87

అని శివాకృతి దోచుబాలునికి మ్రొక్క
భక్త వరులగు వారి నద్వైత గిరికి,
నడిపె శంకరుండన్నపూర్ణాప్రసాద
మందకే యందునే జీవియాత్మ శక్తి?" 88

ఈ విశ్వంబున సగుణ
శ్రీవిలసిత శక్తి నర్చసేయగ నదియే
కేవలమాబ్రహ్మం బై
భావానంద ప్రదమగు భక్తి నొసంగున్ 89

గురుశిష్యులలో భేదం
బిరువురికిని నిత్యసత్యమిదిభక్తి యగున్
మరి తల్లిబిడ్డలందిరు
వురికి నభేదంబు జ్ఞానపూర్ణంబయ్యెన్ 90

అని దలంచుచు గురుడు శిష్యాళితోడ
గంగలో స్నానమొనరించి, కావిగట్టి,
ఫాలమున భస్మరేఖలు పరిమళింప,
యోగదండంబుతో ముందు కేగుచుండె. 91

సారమేయంబులడ్డమై దారినిబడ,
తూలి పైబడుచున్న చండాలుజూచి
తొలగు తొలగుమోయని శిష్యుడలుగ, వాడు
కుక్కలంబట్టి పరిహాస దృక్కులెగయ 92

నేను తొలగకున్న నీకేమి ఖో! యన
కల్లుకంపుగురుని కసరె, శిష్య
"దంటరానివాడ వధమగుణుండవు,
బుద్ధి హీనుడీవు ముట్టెద" యన 93

ఏమి, నిన్ను ముట్ట నీమేని సిరియాఱు
నా? యని వికటాట్టహాసికాగ,
చూచుటెనిను మైల, శుచిగాన్ సచేలస్న
పనమొనర్చుకర్మ, బట్టుననగ 94

ఏటి మాటలు బాపడా? యేది యంట
రానిదో! బుద్ధియేదో! విహీన గుణము
లేవొ! అన్నింటి కొక్కటే తావుకాగ,
దూరమని దూరుటన్ యతి ధూర్తుడైతి. 95

అంటరానివాడ, నధమ గుణుండ, నిరా
కృతుడ, నన్ను బుద్ధి హీనుడనుట
నిజమె, కాని, నీవు, నీబుద్ధి, నీగుణం
బీయతి స్వరూపమెంత నిజమొ! 96

తనువెమలినమైన, తప్పింప తరమౌనె?
ధాతకైన వానితాతకైన,
ఇంకనాత్మగుణములెన్నగా నది చేత
నామయంబు, దానినడ్డుటెటులొ!॥ 97

అద్వయ బ్రహ్మమన్నిట వ్యాప్తమగుచు
ఆది మధ్యాంతరహితమై యలరు చుండ
చేతనంబెట్లు దూరంబు సేతు వయ్య?
బ్రహ్మవాది! నీ పలుకుల భావమేమొ! 98

కాంచనకలశాకాశంబు కంటె కడవ
నున్నగగనంబు భిన్నమైయుండగలదె?
గంగదోచు సూర్యుండు మాతంగ వాటి
నీరదోచు సూర్యుండును వేరెయగునె? 99

కావిగట్టి సర్వజీవుల సమదృష్టి
చూతునన్న గురుని చేతలివియె?
వేషధారివైతి భాషింతు వద్వైత
మౌర! బ్రతుకు ద్వైతమందె నడచె॥ 100

పంచభూతాలకే లేని వక్రబుద్ధి
ప్రాజ్ఞునకు జగద్గురునికి పట్టునె? యన
ఛాత్ర వర్గము మ్రాన్పడాచార్యగురుడు
మాటలుడిగి ముందు బడి నమస్కరించె॥ 101

ఇతడు చండాలుడెట్లౌను? ఎఱుక లేక
వేషమున్ జూచివెఱ్ఱిగా ప్రేలినాడ!
విశ్వనాధుడేయంచు వేవేగలేచి
కనులు విప్ప వేదమయుండె కానవచ్చె॥ 102

సారమేయంబు లుపనిషద్స్వరముతోడ
చంద్రమౌళిని చుట్టు దృశ్యంబు చూచె,
తొలగె తొలగె ప్రభూ! నన్ను తొలచుమాయ,
నిన్ను చూడనిచూపె, నన్నింతజేసె॥ 103

జాగ్రదాది యవస్థల స్పష్టమై, పి
పీలికాది బ్రహ్మాంతము వివిధ రూపు
లగల చైతన్యమే అహంబ్రహ్మమంచు
నెఱుగు చండాలుడైనను గురుడు నాకు॥ 104

ఆ యఖండసచ్చిదానంద మందున
బ్రహ్మ విష్ణురుద్రుల సృజియించి
పండితులను శైవ వైష్ణవ మతులగా
త్రిప్పెమాయ, దీనిద్రెంచుటెటులొ! 105

ఎప్పుడేటికెట్టులీమాయ బుట్టెనో!
జగతినెల్లగలచు శక్తి దీని
కెటుల కల్గెనో! గ్రహింపగాదు, జనని
గ జనకునిగ సృష్టిగతుల నడపు 106

అఘటన ఘటనా ఘటికయై ఆవహించి,
భోగకూపంబులో గూల్చుయోగినైన,
ఈ మహామాయ చేసెడి యింద్రజాల
మెటుల తెగటార్చుటో దేవ! ఎఱుగకుంటి 107

జాతిగుణ భేద రహితమై సంతతసుఖ
చిద్ఘనాత్మకమౌ యాత్మయందు, బ్రాహ్మ
ణాద్యహంక్రియా పుత్రమోహాదుల మెర
యించె యీ మాయ, దెగటార్చుటెటులొ దేవ!॥108

వేదమయు డర్ధనారీశుడై దయార్ద్ర
హృదయుడై, మాయయే లేక సృష్టిలేదు,
సృష్టియే లేక, ఆత్మ సంస్థితి నెఱుగవు,
ఆత్మ నెఱుగక, యనుభవంబందలేవు! 109

సాధ్వి జనని యగును, జనని నర్చింప బ్ర
హ్మత్వమిచ్చు, జీవుడాత్మజుడయి
స్వార్థ పరత, మాయ జాలంబులో బడి,
తన్నుదానెఱుగక తన్నుకొనును॥ 110

ప్రణవమధ్యాక్షరమడంగ ప్రభవమైన,
అమ్మయే జన్మమిచ్చు బ్రహ్మాండమునకు,
అదియె విపరీతమైపోవ, నఖిల సృష్టి
మాయగా మాయయే, అదృశ్యమౌ చివరకు॥ 111

ఉన్నదని దలంప యుజ్వలంబై యుండు
లేదని దలపోయ లేక యుండు,
ఉండిలేక, లేకయున్నదియే మాయ
ఈ చికమక నీకు నేటికయ్య! 112

గుణగణాశ్రిత మాయచే కొట్టబడిన
భావజగతి, నాచేతనే ప్రభవమయ్యె,
మాయనాలోనబుట్టె, నేమాయలోన
లేను, జ్ఞానికీ మాయ నిర్లేపమన్న! 113

మహదహంక్రియాభిమాన శక్తులెమాయ,
దీనిచే జగాలుకానబడియె,
కాని లోనెఱుంగు వానికీ మాయయే
నీటిబుడగ, పొల్లు, నెరిమరీచి॥ 114

ఈయన్నింటి నెఱిగి తు
రీయాతీత స్థితిన్ చరించెడినికీ
మాయామేయజగముల
న్యాయంబే బ్రహ్మమగుచు నానందమిడున్ 115

కాశీనాధుడు శివుడా
శ్వాసించి పలుకుపలుకుల పరమార్థమెఱుం
గీ, శంకరుకనులు విరిసె,
ఆశంకరుడితని యందె ఐక్యంబయ్యెన్ 116

చూపుమేరసుధలె, సుస్వరలీలాత
రంగరుచులె, దివ్యరత్నదీపి
కా ప్రభాళియే, జగమనంతశాయిగా
కనులు గట్ట శివుడుకదలడయ్యె. 117

# దర్శనం

ఒకటి రెండయ్యె, నారెండె యొకటికాగ,
మూడు, నైదు, నేడుగ సముద్భూతమగుచు,
తొమ్మిదిగదోచి, తుదకు పూర్ణమ్ముకాగ,
పూర్ణమునబుట్టి పూర్ణమే పూర్ణమయ్యె.

## దర్శనం

అంటరానివాడె యర్ధేందు మౌళియై,
అర్ధనారిగ, కనులందు మెరయ,
ఛాత్రులు చకితాబ్జ నేత్రులై, శంకర
పదములంటి ముందు కదలుచుండ్రి॥ 1

ప్రళయమందజాండము, జలార్ణవమగుగతి,
నిఖిలమాత్మస్వరూపమై నిండుకొనగ,
ఏమి సేయుదు, నెక్కడికేగువాడ,
ఏదిగైకొందు, విడువగ యేదిగలదు. 2

కణకణంబుల, స్థాణువే కానుపించె,
కొమ్మకొమ్మల, బ్రాహ్మియేగుసగుసమనె,
జీవజీవుల, శివశక్తి చిందులాడె,
కాశిలో గురుండానందకళికకాగ 3

చెట్టుచేమ, పుట్టపులుగు, చీమసీమ,
సకల మాబ్రహ్మమేయని, ఛాత్ర తతికి
శంకరుడు మణికర్ణికన్‌చాటుచుండ,
వృద్ధభూసురుడొక్కడేతెంచె నటకు 4

పించె బోసి వెల్ల పంచె కట్టినవాడు,
నెన్నొసట విభూతినున్నవాడు,
జన్నిదంబు మేనసవరించువాడు, రు
ద్రాక్షమాల నరుతదాల్చువాడు॥ 5

చురుకుదనము కనుల సుడిగొన, వృద్ధుండు
బాలగురుని తేరిపారజూచి,
ఇంత చిన్నవాడ, వీయతి వేషంబు
ఎటుల వచ్చెనీకు, నెవడవీవు? 6

దర్శనం

కన్నవారులేరొ! కాదనవినలేదొ!
ఎల్లరన్ త్యజించి, యేటికిటుల
కానలబడి, కాయకసరుల దించు, నూ
రూరు భిక్షగొంచు నురుకుచుంటి 7

రమ్మునాతోడ నిప్పింతు రాజ్యమిపుడె,
బ్రతుకుసవి చూడుమయ్య; నాబలుకు వినుమ
నంగ, శంకరుండలనల్లనవ్వి, శిష్య
వర్గమున్ చూడ, వారలు బలికిరిటుల॥ 8

మిమ్ము చూడనెవరొ! మేధావిగా దోతు
రీయెడ బలుమాటలేల? విప్ర
వర్య! గురుడితండు, బాదరాయణ బ్రహ్మ
సూత్రములకు భాష్యసూరియనగ, 9

బ్రహ్మసూత్రములకె, భాష్యమే, యీకున్ని
వ్రాసెనె? వికటాట్టహాసి యగుచు,
అంతలో గభీరుడై, బొమల్ ముడివడ,
జరతుడాకుమార గురుని జూచి॥ 10

ఏది, యేయొక్క సూత్రమ్ముకేని, సుంత
వ్యాఖ్యసేయుమా, చూతు నీ ప్రజ్ఞయనగ,
వినయ వినమితగాత్రుడై విన్న వించె
శంకరుడు, శిష్యులుత్సుక స్వాంతమంద 11

బ్రహ్మసూత్రార్థ మెఱుగు నెవ్వారికైన,
అంజలి ఘటించుటే మతంబౌను మాకు,
నేన, సకల వేదంబుల నిధియటంచు
బలుకనేర, సూత్రార్థమపారమగుట. 12

అందు మీకు నచ్చినదేదో! ఆనతిందు,
నాకుతోచినంత వచింతునాన్, ద్విజుండు
బాలక! "తదంతర ప్రతిపద్వి" శిష్ట
సూత్రమున్ వివరింపుమా, చూతుమనగ॥ 13

చక్కని ప్రశ్నయేయని, శంకరుండు
అయ్య! యుత్క్రమణావస్థయందు, జీవి
పంచతన్మాత్ర సంస్కార బద్ధుడగుచు
ముందుబడుటెట్టులో యను మూలభూత 14

సంశయమడంగ చెప్పెద, సాధనాచ
తుష్టయమున, బ్రహ్మైక్య ముత్కృష్టమంచు
కొంత వివరింప, వృద్ధుడు క్రుద్ధుడగుచు
చాలుచాలునీవాదము జల్పమయ్యె. 15

బ్రహ్మమననేమి? జీవుడెవ్వడు? జగంబు
లెట్లుకలిగె? యీశ్వరుడన నెవ్వడీ బ
రస్పరప్రభేదమెటుల ప్రభవమయ్యె?
దర్శన ప్రమాణంబుల తర్కమెటులో! 16

గ్రుక్క త్రిప్పుకో లేకుండ, కుమ్మరించు
ప్రశ్నల పరంపరావర్షపాతమునకు
చుట్టు చుట్టెడి శిష్యులు స్రుక్కుచుండ
చెక్కుచెదరక శంకర చిత్తమలరె॥ 17

దేవ! యిటనిల్చుకొనియె వాదింపనేల?
రండటంచును చూపె దర్భాసనముల
పద్మపాదుడిర్వురికిని పాదు కొలిః
ఇర్వురు సుఖోపవిష్టులై రెదురెదురుగ 18

దర్శనం

శంకరుడు బల్కె బ్రహ్మమే సత్యమీజ
గంబు మిథ్య జీవుడు వేరుకాదు బ్రహ్మ
మే స్వతః శ్రుత్యనుభవంబు ప్రమాణ
మెరుగ జీవేశ్వరైక్యమే దరిశనమన 19

జీవుడీశ్వరుండై బ్రహ్మసిద్ధిగాంచు,
టాత్మ బ్రహ్మమై యలరారు, టనుభవమగు
జగతి మిథ్య యనుట నీవిచారమెల్ల
నీరసంబన విప్రుని పారచూచి 20

బ్రహ్మమాత్మకు పర్యాయపద, మఖండ
దృష్టి బ్రహ్మమౌ, అతి సూక్ష్మదృష్టి నాత్మ
రెంటికిని లక్ష్యమొకటియే యంటియంట
కన్నిటన్ వెల్గు నిత్యసత్యమది యొకటె॥ 21

అది, సదా, సర్వథా, స్వచ్ఛమై, ప్రబుద్ధ
మై, విముక్తమై, సర్వజ్ఞమై, యనంత
శక్తి సంభృతమై, జ్ఞాన సంప్రదీప్త
మై, తనయునికిఃపోలె బ్రహ్మమగు మరియు॥ 22

వాఙ్మనముల కతీతమై వరలు బ్రహ్మ
మీశుడై నిజమాయచే సృష్టి సలుపు,
మాయ మాహేశ్వరాధీనమై యడంగు,
కాని జీవులీమాయచే కలగుచుంద్రు॥ 23

సహజముగ జీవి చైతన్య శకలుడే, య
విద్యనంతఃకరణ చతుర్విధయుపాధు
లబడి పంచతన్మాత్రుడై ప్రాకృతమగు,
స్థూల సూక్ష్మకారణ శరీరాల నలగు॥ 24

ఎప్పుడంతఃకరణ మింకు నప్పుడమల
జీవి విశ్వ చైతన్య సంజీవియగుచు,
ఐశవిభవమున్దాటి బ్రహ్మస్థితిగను,
ముక్తియిదియె, తత్త్వమసి ప్రబోధ మిదియె॥ 25

తెలియ దేహేంద్రియాలకతీతమైన
ఆత్మయే నేను, చూడ దృశ్య ప్రపంచ
మంత; మాయచే బ్రహ్మంబునందు దోచు
తన్నుతానెరుంగుటె తత్త్వదర్శనమగు॥ 26

ఇంటిలోనున్న దీపంబు, నింట బడిన
దొంగలకు యజమానికి దూరమగుచు,
సాక్షియై యుండు రీతి, దేహాంతర ప్ర
వృత్తులదగుల్కొనక ఆత్మ వెలుగుచుండు॥ 27

జీవుని సవికల్పచేతనంబే చిత్త
వృత్తుల ప్రతిఫలమింద్రియాలు
వెలుగుచుండు, వివిధ వృత్తుల మధ్యాంత
ర మగు చేతనంబె బ్రహ్మమయ్యె 28

ఇదియెనిర్వికల్ప బ్రహ్మ, మెపుడు జీవు
ని సవికల్ప వృత్తుల మధ్య నిడివి పెరిగి
నిర్వికల్ప చైతన్యమే నెగడు నపుడె
అహము బ్రహ్మమై జీవేశ్వరైక్యమబ్బు॥ 29

ఎవ్వడు స్థిరాస్థిరముల నెఱుకనెరిగి
ఐహికాముష్మిక సుఖాల కంటుకొనక
శమదమాదుల సాధించి స్వచ్ఛతగను
వానికే ముక్తిముంగొంగు పైడియగును 30

నిర్వికార నిరంజన నిర్విశేష
నిర్గుణాల, యనిర్వచనీయమై, తు
రీయమై, కేవలానందమై, యలరెడి
బ్రహ్మమనుభవాద్వైతికే పట్టుబడును 31

రాయిరప్పగాక బ్రహ్మము నిత్య స
త్యమదియే, సతత చిదాత్మకంబు,
జన్మజలధి నడచు సచ్చిదానందము,
ముక్త జీవులిందె పొందగలరు॥ 32

తనువు ప్రారబ్ధకర్మచే తప్పదేని,
వ్యక్తమగు చరాచర జగంబంతయు బర
మాత్మరూపమై, కల్యాణియై కనబడు
ఆతడు స్థిత ప్రజ్ఞుడై యలరుచుండు॥ 33

చూచునేగాని చూపుల చేట్టుకొనడు
పలుకునేగాని బల్కుల బంధిగాడు
చేయునే గాని చేతల చిక్కుకొనడు
కేవలమనుభవానంద జీవుడతడె॥ 34

ద్వంద్వముల కాతడెప్పుడు తల్లడిలడు
నిర్మమ నిరహంకార వినిస్పృతమతి
సతతమంతర్ముఖుడు కర్మసాక్షియనగ
శంకరా! యీ యుపన్యాస మింకచాలు 35

వృద్ధవిప్రుని వాక్కుల వినబడె, నిగ
మాగమోక్తులు కోకొల్లలగుచు కాని,
ప్రణవతత్త్వంబునందవి పక్వమగుచు,
బాలవాక్కున బ్రహ్మానుభవముచిందె॥ 36

ఉపనిషచ్ఛ్రుతిపాద్యమైయొప్పు బ్రహ్మ
మాత్మ తత్త్వమొక్కటె సూత్రసత్యమనగ
కాదుకాదు బాలక! సమగ్ర శ్రుతికివి
వివిధ రూపంబులని పొరె విప్రవరుడు 37

పట్టు విడువక ప్రజ్ఞతో బాలుడుక్ష
ణక్షణమెదురుగాని విజ్ఞానికాగ
వృద్ధుడాత్మ సంతృప్తినుద్దీప్తుడగుచు,
నర్మగర్భపు వాక్కుల నయతమెరసె॥ 38

శ్రుతులిరువురికి మధ్య పర్వులనుదీసె
శాస్త్రతతి యూపిరాడక చతికలబడె
స్మృతికి విశ్రాంతి లేదయ్యె చెక్కుచెదరె
ఆపురాణేతిహాసంబులండలేక॥ 39

వారు వాద వివాదముల్ బడ దినంబు
లేవొ! రాత్రింబగలులేవొ! స్మృతికి రావు,
పరిసరాంతర ప్రకృతి కన్పట్టకిర్వు
రద్వయ బ్రహ్మవాదులైయలరుచుండ్రి॥ 40

పైబడు ప్రశ్న నడిమికే బదులు చూచె
ఎగసి బడుయుక్తి లేనవ్వ కెగరిపోయె
పాండితీబలంబనుభవ ప్రజ్ఞ కరగె
బాలవృద్ధుల రూపమే లీల యయ్యె॥ 41

అన్నపానముల్ మఱచి, దినాష్టకంబు
లాకుమార వృద్ధులు వాదమందు మునుగ,
ఓడుగెలుపులే ఉయ్యాలలూగుచుండె,
ఊపిరాడక శిష్యులు నుడుకుచుండ్రి 42

ముందుబడకాళ్ళు వెనుకకుడెందమీడ్చె,
పలుక నోర్విప్ప, నాలుకన్ పట్టెబుద్ధి,
భక్తి దరిజేర్పగా, భయంబవలనూకె,
చేయునదిలేక శిష్యాళిచింతలబడ॥ 43

విప్రుని వచో విలాసంబు, విష్ణుమూర్తి
విపుల బహ్వర్థ శక్తినే విప్పిచెప్పె,
వైష్ణవ ప్రభ వ్యాసుడై బ్రాహ్మణునిగ
వచ్చె, లేదు సందేహమీ ప్రకృతి చూడ॥ 44

నిర్గుణ బ్రహ్మమే యిట నిర్వికార
మగుచు, ననుభవ జ్ఞానిగా నవతరించె,
శంకరుని నుడిన్ సర్వజ్ఞ శక్తి మెరసి,
హరిహరులు సేయు, నీవాదమంత మగునె? 45

వ్యాసుడీతడంచు పద్మపాదుడు సాహ
సించి గురుని చేరి చెవులనూద
ఆ ముదుకని వదన మాయాసమున్కడు
బడలు టెరిగి మ్రొక్కె బాలగురుడు 46

వృద్ధులయ్యు నిరాహార వృత్తి నింత
దాక, సమయోచితముగ వాదంబు సేయ,
విప్రరూపాజనార్ధనా నా ప్రసిద్ధ
సూక్తి నిజమయ్యె, నిజ రూపుచూపరాదె? 47

నలుమొగంబులొక్కటి సేయు నలువవేమొ,
రెండు చేతుల నిల్చు విష్ణుండవగుదొ,
ఫాలనేత్రము దాచు సర్వజ్ఞుడగుదొ,
ఉపనిషద్బ్రహ్మమీగతి ద్యోతమగునొ! 48

నీవనాలోన నిలచి, నన్నింత సేయ
గంటి, సూత్ర భాష్యంబు లొక్కటిగ నడచె,
పెద్దఱిక మీ చిరుతలకు వృద్ధులిచ్చు
టరుదె? ఆనందకేళికి హద్దుగలదె? 49

వైష్ణవ ప్రభ విప్రరూపంబు దాల్చి,
నన్నుసానబట్టగ వచ్చు, వెన్నుడీవు
ముసుగు తొలగించి కరుణింపుమో యనంగ,
కనులు చెరువయ్యె విప్రుండు కరగిపోయె. 50

మమత పూర్ణమై వ్యాసుడాత్మ స్వరూప
మెఱుకవడ, శంకరుని యెదయెదకు జేర్చె,
చేర్చ, జీవేశ్వరైక్య సంసిద్ధియనగ
ద్వైతమద్వైతమై వాగ్వివాదముడిగె॥ 51

వ్యాసుడిదియున్నదేగాని, అన్యులకడ
నేర్చినదికాదు, సూత్రముల్ కూర్చునప్పు
డిట్టివాడుండునాయనిపుట్టెశంక
కాని, కన్నారగంటి యాజ్ఞానినిందు॥ 52

ద్వాపరంబున గంటి, యాదవులలోన
పూర్ణుడౌ సచ్చిదానంద మూర్తి, నిందు
కంటికేవల జ్ఞానమున్, కలినడంప,
బుట్టుసర్వజ్ఞునిను, నీవు బుడుతవగుదె? 53

మంత్ర తంత్ర నిష్ణాతుడై, మనుకుల ప్ర
వర్తకుండై, గుణాష్టక ప్రవరుడై, య
ఖండ పాండితీ ప్రజ్ఞల కవిగురుడగు
నీకు, తత్త్వ వేత్తకు సాటి నీవె, యనగ 54

## దర్శనం

అయ్యా! సాత్యవతేయ! భాష్యంబుముగిసె,
పోదు నింక సాయుజ్యమున్ పొంద, ఆన
తిండని శిరంబువంచి, శివుండు వేడ,
ధ్యానముద్రితుడై వ్యాసుడాత్మనెరిగె॥ 55

మాత్రుదేవోభవా! యను మాట నిలుప
ద్వైత, మాచార్యదేవోభవాయను నుడి
ఇల నిలుప, విశిష్టద్వైత మీతడందె
తన్నుదానెఱిగి యిపుడద్వైతియయ్యె॥ 56

ఇతడహంకరామమకార మెఱుగ డుపని
షన్మతంబును భూమిపై చాటు శివుడు,
జ్ఞానవైరా'గ్యమూర్తి, యింకను బ్రతుకుటె
సూక్తమసి, మదిన్ భావించి సూనృతోక్తి 57

గురునిమాట నిలుప గోవింద శిష్యుడై,
భాష్యరచన జేసి ప్రణుతిగంటి,
తల్లిమాట నిలుప తనయుండవైనీవు
మాత్రుకర్మ మాటమఱువ దగునె? 58

కర్మకాండకు కాలంబు కలసి వచ్చు
నంతవరకు, నాధ్యాత్మ విద్యాప్రభావ
మవని దీపింప బోధింపు మయ్య, ఆయు
విచ్చితినని వ్యాసుడట నదృశ్యుడయ్యె॥ 59

శిష్యులానందభరితులై చెంత జేరి,
వ్యాస భగవానువాక్కులు వ్యర్థమగునె?
మఱుగుబడియున్న నుపనిషన్మతము, నిందు
జనుల కందించుటే జన్మ సార్థకమగు, 60

పండిత ప్రకాండులంగని, వారియెదుట
బ్రహ్మసూత్రభాష్యంబును ప్రచురపరచి,
ఆత్మ దర్శనంబద్వైత మందరంద,
గురుడునడచె, ప్రయాగ కాపురజనాళి 61

కంట తడిబెట్టి గద్గద కంఠులగుచు
వేదధర్మంబు రక్షించు విప్రుడీ కు
మారిలశరీరము తుషాగ్నిమండుచుండె
మాన్యమహితాత్ముడే లేడె మహినటన్న 62

వార్త విని, కుమారిల భట్టు పట్టునెరిగి,
శంకరుడు హుటాహుటి వచ్చె, షణ్ముఖాంశ
సంభవా! వేద వేదాంగ శాస్త్ర దిషణ!
ఈ విధంబుగ దేహమున్ వ్రేల్చదగునె? 63

ఆత్మహత్య మహాపాపమనుట తెలియ
దే? యన గురుని మోమును తేరిపార
జూచి, సర్వజ్ఞుడీ జగజ్జ్యోతియంచు
నాత్మనెరిగి, ప్రభాకరుడనెడి శిష్యు. 64

చేరబిలిచి, అపరశివుడీతడు, కుమారు
డై కుమారుగావ, నరుగుదెంచె,
అతిథి పూజ నితని నర్చింపుడో యని,
దేవ! కొనుడు శిష్యసేవలనగ. 65

అంత నా ప్రభాకరాది శిష్యులు, యతి
వరుని కుచితరీతి, పదములంటి,
పూజసేయ, సర్పభూషణ చిహ్నాలా
తనువునగని, గురుని మనసు కరుగ 66

అశ్రు ముత్యాల దడుపుచుయతిని, మా కు
మార గురువరు రక్షించి మాకొసగరె?
తాదలచినట్టుల, సజీవ దగ్ధమంద
జూచునేగాని, మాగోడు చూడడనగ 67

శంకరుడు భవిష్యర్థమున్ స్వాత్మ నెరిగి,
మరణమందున, ధర్మకర్మల విడువక
పూర్వ మీమాంస కాదర్శ పురుషుడయ్యె
మీగురుడు పుణ్యలోకాల కేగుగాక॥ 68

వచ్చిభట్టుమోమును చూడ బలికెనతడు
దేవ! నేను కృతఘ్నుడ, దెలిసి తెలిసి
బౌద్ధ ధర్మస్వరూపియౌ పండితగురు
వరుని, భంజించినాడ, వాగ్వాదమందు 69

వేద ధర్మ సంస్థాపనా విధికి జగతి
నడ్డుపడుచున్న బౌద్ధులనంతు తెలియ,
వారికిష్టుండనై వారి పట్టు లెరుగ
తర్కనైపుణ్యమున్ నేర్చి తరలు చుండ 70

వారు నన్ను వేదవాదిగా గుర్తించి,
కొండ శిఖరినుండి కూల్చినారు,
కాలనాగు చేత, కరపింప చూచిరి,
కాని వేదమాతకాచెనన్ను 71

అంతట నృపుని సాహయ్య మంది, బౌద్ధ
గురుని, అతని శిష్యుల యమపురికిబంపి,
పాపినైతి, ప్రాయశ్చిత్తవహ్నికంటె
తనువు, నీతుషాగ్నుల వ్రేల్చ ధర్మ, మనగ 72

జన్మతారకమై, సదసద్వివేక
మండజేసెడి విద్య, విద్యయగు వాడె
గురుడు, తద్విరుద్ధంబగునరుడు, విశ్వ
కంటకుండై నృపాల శిక్షనడగారు॥ 73

నాస్తికుల సమూలనాశంబుగావించి,
వేద ధర్మవిధుల వెలుగ జేయు,
దండపాణి వీవు, ధర్మప్రతిష్ట నా
ర్జించుకొన్న వీర శేఖరుడవు॥ 74

సంతసింపదగిన సమయంబునన్ చింత
దవిలి, ఆత్మహత్య తగులబడుట.
నీకు ధర్మమగునె? నీదగ్ధపదముల
మంత్రశక్తిమరల మనగనిత్తు 75

నీవే మద్భాష్యమునకు
వే వార్ధికము రచియింప విజ్ఞుండవనన్,
దేవా! వలదువలదు, నా
కీవిధి వేదవిహిత మిదియేపొందదగున్॥ 76

సర్వజ్ఞుండగు మీతో
పార్వడ, గురువంచకుండ బలుకందగునే?
పూర్వాపూర్వములెరిగిన
పర్వాగమవేత్త, నాకు ఛాత్రుండుండెన్ 77

వాడు మండన బిరుదు డపారశాస్త్ర
విదుడు, కర్మ చతుర్ముఖుండెదుట నిల్వ,
యోగ్యుడావిశ్వరూపుని యువిద ఉభయ
భారతి, జయింప వారిని ఫలము మీది॥ 78

కరుణాకర! హేశంకర!
గురుదేవా! యంత్యమందు కుమిలెడినాకున్
చిరతర తారక మంత్రము
తరియింప నొసంగుమయ్యా! ధన్యుడనగుదున్ 79

అన, శంకరుడాదృఢ చి
త్తుని కర్మాచరణకు, మదితోషింపగ, కో
రిన గతి తారక మంత్ర మ
తనికిచ్చె, సురవరులీర్ష్యదప్తులు కాగాన్॥ 80

# భిక్ష

పక్షులే వేద పంక్తులు వల్లెవేయ
స్వర్గభోగాది భాగ్యముల్ ప్రజలుపొంద
పూర్వమీమాంస పండిన పుణ్యభూమి
సత్యమో మిథ్యయో చూపు శాఖ యిదియె ॥

## భిక్ష

ఖ్యాతమండన మిశ్రుని గాంచ గురుడు
వచ్చెమాహిష్మతీ పుర ప్రాంతమునకు
ఆ ప్రకృతి యెల్ల నవనవాహ్లాదకారి
యై మనంబునజ్ఞాత లోకాలదేల్చె ॥ 1

స్వర్గమే సరోవరముగ జగతిమెరయ
అప్సరోగణ మబ్జంబులై విరియగ
సతులతోఋషుల్ రాయంచజంటలగుచు
ఊగుచున్నట్టులుండె నాయూర్మికాళి 2

పక్వఫలభరితంబులై వంగియున్న
వనమహీజాగ్రశాఖలవాలి శుకపి
కప్రకరముల్ స్వరమ్ముల కంఠమెత్తె
నిఖిలనిగమాగమంబుల నేర్వదలచి ॥ 3

యాగములవ్రేల్చెడి హవిస్సులంబరంబు
నంటె ధూమవల్లరులగ ఆ ప్రభావ
మఖిల జగతి పరిమళించి హాయి గూర్చె
శ్రవణ శుభగ స్వాహాశబ్ద శక్తులెగసె ॥ 4

మింటనున్న నింద్రాదుల మంటికీడ్వ
వారు యంత్రమంత్ర స్వరూపములుదాల్చి
ప్రజల వాంఛితార్థము దీర్తురహరహంబు
శాంతి సుఖములకీ భూమి జన్మభూమి ॥ 5

ఆ మనోహర చిత్రదృశ్యముల లక్ష్య
మెఱిగి నవ్వుచులోలోన గురుడు దలచె
శబ్దమేబ్రహ్మమయ్యెనిసర్గమహిమ
నింకనిటనున్న మండనుండెంత ఘనుడొ! ॥ 6

భిక్ష

ఆతడెట్లుండునో! మఱియతని శక్తు
లెట్టివో ! యమ్మహాత్ముని చుట్టుచున్న
ఉభయభారతియెట్టిదో! యూహకంద
దని నడచుచు హఠాత్తుగనాగి యెదుట 7

పండుముత్తైదువున్ చూచి బాలగురుడు
అమ్మ! విశ్వరూపుండను ఖ్యాతవేద
శాస్త్ర పండితుడువసించు సదనమేదొ !
గాంచవలెచూపి పుణ్యంబు గాంచుమనగ ॥ 8

అమ్మ ! యను మధురోక్తికి యాత్మ పులక
రించ బ్రహ్మవర్చస్సురూపించు చిఱుత
నరసి తనుదానెఘుఱచి వందనమొనర్చె
అల్లనల్ల నా తల్లి మాటాడదొడగె ॥ 9

అన్న ! పూర్వాభిముఖుడవై అరిగితేని
వేదఘోష విన్పించెడి విప్రవాటి
చూడగల వందెపూదోట మేడముందు
పంజరస్థమౌ పక్షులు బల్కునిటుల 10

శ్రుతి తనకుతాప్రమాణమై బ్రతుకగలదొ !
కాక పరతఃప్రమాణమై క్రాలగలదొ !
కనబడుజగంబుసత్యమో గాక మిథ్య
యో ! సకల జీవకోటికి యునికి యేదొ ! 11

సతత మీరీతి బ్రహ్మ చర్చల జరిగెడి
పంజరగృహమె మండన భవనమంచు
కొంతదూరము చని వెన్కకు మరలి మృదు
లార్ద్ర వాత్సల్యముబుక కంజాక్షి బలికె ॥ 12

చిన్నవాడవు వర్చస్సుచిందు దీర్ఘ
నేత్రములవాడ వాతండు నిన్ను మెచ్చు
కాని యీకావులంజూచికసరికొట్టు
అతనిసాధ్విమహాజ్ఞాని యరుగుమన్న ॥ 13

చిట్టిసన్యాసిలేనవ్వు చిందుకనుల
శిష్యులన్ చూచి యిచ్చటి స్త్రీల యందు
ఎంతగా ముద్రవైచెనో యితని శక్తి
నెంచుడోయని తత్త్వమూహించుచుమది 14

భోగి కర్మాభిమానియై పోవు; యోగి
నిజశరీరాభిమానియై నిలువజూచు;
జ్ఞాని మోక్షాభిలాషియౌకాని నిరభి
మాని తత్త్వజ్ఞుడౌనని మలపు తిరుగ 15

చకితుడైయున్నదున్నట్టు శంకరుండు
శారికాకీర చర్చల సత్యముగనె
అచటనే నిల్చి ముంగిట నలుకు ముగ్గు
లేక మూసిన తలుపుల గృహము చూచె॥ 16

ఇంటనేదోవిశేషమే యీదినాన
జరుగుచున్నది నేనిదే తిరిగివత్తు
అంతదాక మీరుశివాలయాననిల్వు
డంచు శిష్యులబంచియోగాఢ్యుడగుచు ॥ 17

ఇల్లుచేరియచ్చైశ్వర్య వృద్ధిజూచి
మండనుడు మహాభోగసంపన్నుడీప్ర
బుద్ధుడిట పవిత్రముదీసి ముందు వ్యాస
జైమినులపదాలకడుగ జలములెత్తె 18

అవి, నిమంత్రిత బ్రాహ్మణ శ్రేణి నిలచె
అరుణకాంతులచిందు శంకరునిపదన
ఖప్రభల్ పట్టు వెలిచి ముఖంబునెత్త
విశ్వరూపుని హృదయంబు విహ్వలించె॥ 19

ముండితశిరంబు మంటలబుట్టకాగ
కావులూర్ధ్వాగ్నికీలలై క్రమ్ముచుండ
సూత్రహీనమౌ వక్షమున్ చూడలేక
చిన్నవానిని జూచుచు చీత్కరించి॥ 20

క్రోధ ఘూర్ణితరూపుడై రూపుదాల్చు
ఆగ్రహమన గృహస్థు సన్యాసి! మా ప
విత్ర పితృకర్మ చెఱప భావించి తేల?
ఏల పెడదారి బట్టితో యేడ్వుమనగ॥ 21

కర్మలతబోలు సూత్రపుగంటు తెంచి
కుటిలకుట్మల కుంతలాల్ కూలదరిగి
సకలజీవుల కభయ ప్రసాదమొసగ
కావికట్టితి దారి డొంకలు సమమని 22

చిరునగవు చింద చిట్టి శంకరుడుబలికె
నీసుకృతము పక్వంబయ్యె నిన్నిటకడ
తేర్పవచ్చితి"నన "నీయతిస్వరూప
మాహుతిన్ జేతు శాపాగ్ని" కంచురేగ॥ 23

ఓహోహో ! నిలునిలుమిది
సాహసమొనరింపదగిన సమయముకాదీ
యాహుతి పితృయజ్ఞంబున
స్వాహాపతి యొల్లడయ్య ! శాంతింపదగున్ ॥ 24

ఇతడు శాంతమూర్తి యతివర్యుడతిథి య
జ్ఞమునకేగుదెంచె కాన నిలిపి
హరిపదాన నితని నర్చింపవలెనని
వ్యాసజైమిని ఋషివరులుబలుక ॥ 25

చల్లబడెమండనుడు శుచిస్నాతుడగుచు
వచ్చి తప్పు సైరించిదేవా ! మదీయ
భిక్షగైకొనుడనియతిన్ వేడ నతడు
వాదభిక్షగోరితికర్మవాది! వినుము ॥ 26

యతికి వాదంబుతగదంచు మతినెఱుగుదు
కాని మీప్రవృత్తి పదంబు కంటె ప్రజల
కీనివృత్తి మార్గంబెయుత్కృష్టమంచు
స్పష్టమొనరింపనుంటి విప్రకులతిలక ! ॥ 27

కర్మకంటెను జ్ఞానంబు ఘనతరంబు
ప్రకృతికంటెను పురుషుండు ప్రబలుడీయ
నంతసంసారికంటె సన్యాసిమేలు
ఋజువుసేయ నేతెంచితీ యెడకనంగ ॥ 28

మండన మిశ్రునితో భూ
మండలమున వాదుసేయ మహనీయుండొ
క్కండిటకేతెంచుట మా
పాండిత్యమ్మునకు వన్నెవచ్చుట కాదే ? ॥ 29

యతివరేణ్య! మీరలానతిచ్చిన రీతి
వాదభిక్షనిచ్చువాడరేపు
నేడు భిక్షగొనుడు చూడ త్రేతాగ్నులం
బోలు మిమ్ము కొలువ మేలు మాకు॥ 30

భిక్ష

మనవాదంబున తుది తీ
ర్పు నొసంగ సమర్థులెవ్వరో! యని ఋషులన్
గన వారు శంకయేటికి
అనుపమ విద్యాపయోధి యండనె యుండన్॥ 31

నీసాధ్వి యుభయభారతి
మీ సామర్థ్యముల తూచి మిమ్మలరించున్
వ్యాసుని సూచనకున్ స
న్యాసియు సమ్మతముదెలిపె నందరు మెచ్చన్॥ 32

మండనుని భిక్ష గ్రహియించి మాన్యుడగుచు
శంకరుండరుదెంచి శిష్యతతి జూచె
వ్యాస జైమిను లాపిత్ృ యజ్ఞమందు
తృప్తులై నభోవీధినదృశ్యులైరి॥ 33

## వాదభిక్ష

జనులు జిజ్ఞాసులై సభాసదులుకాగ
స్త్రీలు బ్రహ్మవిద్యల తుది తీర్పునీయ
జీవుడే జ్ఞాన శిఖలచే శివుడు కాగ
భరత సంస్కృతి సారమే బ్రహ్మమయ్యె ॥

ఎవరో మహనీయుండట,
వివిధోపనిషద్రహస్య విజ్ఞుండట, మా
నవులన్ దరిజేర్చెడి బ్ర
హ్మవాదియట, వాదభిక్షకరుదెంచె నిటన్! ॥ 1

చిరుత ప్రాయమునన్ యతి
వరులై తత్త్వంబుదెలుప వచ్చిన పరమే
శ్వరుడని కర్ణాకర్ణిగ
పురజనముల్ విని కవిగురుబుధులేతేరన్ ॥ 2

వచ్చినవారికి మండన
సచ్ఛాత్రులు మెచ్చుచు తగు సౌకర్యము ల
త్యుచ్ఛస్థితి కల్పించిరి
అచ్చపు బ్రహ్మసభగనభ సార్థకమందన్ ॥ 3

గుహయొ, గృహమొ, సాహసమో
సహనమొ, త్యాగంబొ యోగసంభరణంబో!
మహిమయొ మమతో, పరమో
యిహమో, మోక్షంబొ సారహితసర్గంబో ! 4

ఏదో యొకటీ దినమున
వాదంబున దేలగలదు పదపదమనుచున్
మోదితహృదయుల్ సభకు
త్పాదితకుతుకోత్సుకులయి ప్రజలరుదేరన్ ॥ 5

మండనుడెక్కడ ? యీ యతి
ముండనుడెక్కడ ? సరససముజ్జ్వల విభవో
ద్దండుడు మనవాణీ నా
ధుండితనికి బిచ్చపు చిరుతొండడు సరియే ? 6

చూడవలె నీవిచిత్రమంచు ప్రజ వేయి
కనుల విశ్వరూపగృహప్రాంగణము సేర
యతివరేణ్యుడు బాలసూర్య ప్రభాళి
శిష్యవర్గంబుతో సభాసీనుడయ్యె 7

పువ్వులసిగ పరిమళవిభూతినొసట
బొమలమధ్య చంద్రార్ధపుబొట్టు మెరయ
శుభ్ర వస్త్రంబులంగట్టి సూత్రమలర
మండనుడు వచ్చి యతికి నమస్కరించె ॥ 8

ఎదురెదురుగ నిర్వురెలనవ్వుతో వేది
కాస్థలిన్ సుఖాసనస్థులైరి
వచ్చియుభయవాణి పతికియతికి మ్రొక్కి
న్యాయమూర్తియై సభాంగడికనె॥ 9

ముండిత శిరంబుపై కావిముసుగు గవియ
ఉదయ మార్తండ తేజమై వదనమొప్పె
భస్మ రేఖల మఱుగైన ఫాలశిఖల
జ్ఞాన చక్షువు భాసింప శంకరయతి ॥ 10

జగము మిథ్య బ్రహ్మ సత్య మవిద్యచే
జగతియాత్మదోచు సత్యముగను
శుక్తి రజతముగతి చూపట్టురీతిగ ;
జీవి బ్రహ్మ మగును చిద్బలమున. 11

వ్యాకృతికి శబ్దమే ప్రాణమై వెలింగె
సాంఖ్యయోగముల్ ద్వైతమున్ చాటుచుండె
తర్క మీజ్ఞాన తత్త్వమున్ దడవదయ్యె
పూర్వమీమాంస కర్మకే ముడుపుగట్టె ॥ 12

వహ్నియేలేక జరుగదువంట యటులె
జ్ఞానమేలేక మోక్షంబు కలుగదెపుడు
కర్మకు చెలిమాయ తమస్సు కదపునదియె
జ్ఞానము తమసమడచి ప్రకాశమిచ్చు ॥ 13

ఉపనిష ద్ద్రుతిపాద్యమై యొప్పుచున్న
జ్ఞానమొక్కటే అనుభవ సత్యమయ్యె
అది ప్రవృత్తి నివృత్తులకాత్మశక్తి
జ్ఞానమే సచ్చిదానందసంపుటంబు ॥ 14

నానిలువిది దీనినే నిగమాగమాం
తంఃప్రమాణమనుభవ ప్రకాశ
మంద తిరమొనర్తు నట్లు కాదేని స
న్యాసమున్ త్యజింతు నంతెకాదు 15

ఆ క్షణంబున సంసారినై గెలచిన
మండనులకు శిష్యుండనై మసలుకొందు
అనగయాశ్చర్య చకితయై అప్పటి సభ
మూగవోయె విప్రుడు యతిమూర్తి నరసి ॥ 16

వేదవేద్యుడౌ పరమాత్మ వేదవిహిత
కర్మకాండచే యజ్ఞ భాగంబులందు
నిత్యమై చరాచర జగన్నియతి నలమె
కర్మయే లేక లేదు మోక్షంబు మనకు ॥ 17

శ్రుతి స్వతః ప్రమాణంబయ్యె చూడ జగతి
నిత్యసత్యంబు జీవులనేకులింక
స్వర్గఫలభోగమే ముక్తి జ్ఞానమిచట
సహకరింపదు స్వాత్మీయ సౌఖ్యమునకు ॥ 18

కర్మయే యవశ్య కర్తవ్యమంచు వే
దాంత సూక్తులెల్ల నానతిచ్చె
కర్మ యిహపరార్థ కల్పకంబగు నీశు
డనుట స్వప్న మలసుడాడుమాట ॥ 19

చేతునన్నంతమాత్రాన చేసినట్లు
లగునె ? బ్రహ్మాస్మినా బ్రహ్మమగుట కల్ల
కల్లయయ్యె జీవన్ముక్తి కాంచుటిటనె;
కర్మచేతనే యనుభవజ్ఞాని యగును. 20

ఇదియెనానిలువిట నే శ్రుతికనుగుణం
బిపుడు వాదుసేతునిందునోడి
తేని కావి దాల్చి ప్రాణసఖి సమక్ష
మందె యతికి శిష్యుడౌదుననగ ॥ 21

ఇద్దరు మహాత్ములే యీ
యిద్దరు దమతమ నిలువుల నెరిగిన పూర్ణుల్
ఇద్దరిచే పూర్వోత్తర
సిద్ధంబగు నార్షమతము శిఖరీకృతమౌ ॥ 22

వేదమూర్తియైన విప్రుడొక్కండు వే
దాంత వేద్యుడైన హంసయొకడు
వీరివాదమందు భిన్నశక్తుల హెచ్చు
తగ్గులు తెలియు శుభ తరుణమిదియె ॥ 23

ఓడు గెలుపులు సత్యమున్ చూడగలవు
కాన వీరిశపథముల్ జగద్ధితమగు
ననుచునధ్యక్షపీఠస్థయైవచించె
ఉభయభారతి యాసదస్యులలరంగ ॥ 24

లేచిదివ్యహారమ్ములు రెండుదీసి
ఇరువురికొసంగి మెడ ధరియింపు డెప్పు
డెవరిమెడనున్న హారంబునెందునప్పు
డాతడనుభవజ్ఞానియౌనంచువెడలె ॥ 25

ఉన్నతమగు కార్యౌచిత్యమూహసేసి
తీర్పుపద్ధతి బల్కుల నేర్పు చూడ
ఓటమెరుగని సత్యమున్ చాటె వాణి
యీ మహాసాధ్వికెవ్వరీడీజగాన ॥ 26

సృష్టి సంస్థిత లయలకు జీవమగుచు
కర్మ జ్ఞానికి కూడ మోక్షప్రదమని
మండనుండాత్మవిశ్వాసమండనుడయి
పలుక సభయెల్ల వీక్షించె బాలగురుడు 27

యాంత్రిక మగు కర్మ కతికష్టమౌ ముక్తి
జ్ఞానమందు సులభ సాధ్యమగును
శిఖరమంట క్రింది చీమకు దుష్కరం
బౌను గాని పులుగు కది సుకరము. 28

కష్టమేగాని కాదనకాదు మీక
టంచు విప్రుడాజీవపర్యంత మగ్ని
హోత్రమాచరించుటయె విధ్యుక్త ధర్మ
మంచు శ్రుతులు ఘోషించుట యతులెరుగరె?॥ 29

కర్మయే లేక అనుభవ జ్ఞాని కాడు
కర్మయేలేక పర్జన్యుడాడడతడె
లేక యోషధులన్నంబులే కలుగవు
అన్నమేలేక ప్రాణులుత్పన్నమగునె ? 30

కర్మకాండకువేదమే కారణంబు
వేదమాబ్రహ్మవలన ఆవిర్భవించె
సర్వగతమైన పరమాత్మ సతతమఖిల
యజ్ఞముల సుప్రతిష్ఠితంబయ్యెననగ ॥ 31

జ్ఞానశిఖల కామక్రోధ కలిత మోహ
భేద భావంబులడగార్ప విప్రవరుల
కనుదినంబగ్నిహోత్ర మత్యవసరమని
చాటెనిగమోక్తి పరమార్థ సత్యమిదియె ॥ 32

క్రియయె లేక కర్మలేదు కర్మక్రియా
ఫలమొసగమి ముక్తి కలుగదిందు
కాని జ్ఞానమనగ కైవల్య మిట కార్య
కారణఫలరూపగతులు లేవు ॥ 33

అగ్నిబ్రహ్మ మాహుతిబ్రహ్మ మర్పణాక్ర
మంబుబ్రహ్మము కర్తబ్రహ్మమగు సకల
కాలకర్మంబులా బ్రహ్మకరగిపోవ
అన్యమేదియులేక బ్రహ్మంబె నిలచు ॥ 34

వివిధ రూపాల నగలు కన్పించుగాని
కరగిపోవగ నొక్కబంగారెదేలు
శక్తి వివిధరూపాల సాక్షాత్కరించి
మరుగుపడ నొక్కశివుడె బ్రహ్మమయి వెలుగు ॥35

మండనుడు నిరుత్తరుండయ్యె నంతలో
నుభయ భారతి సమయోచితముగ
పతికి భోజనంబు యతికి సుభిక్షసం
సిద్ధమంచు భక్తి చేరబిలచె ॥ 36

ఇరువురు దమతమ కర్మా
చరణంబులనట ముగించి సరసాన్నములన్
బరితృప్తాత్ములగుచు వే
బరస్పర జిగీష సభకు వచ్చిరి యంతన్ ॥ 37

వారలగని సదస్యులు భక్తి సంభ్ర
మాత్ములై లేచి బ్రహ్మరుద్రావతారు
లంచు వినుతించి లోలోన యాత్మపీఠ
ముల సుఖాసీనులైరి వాగ్బలము తూచ ॥ 38

యతివరా ! మీరు జీవేశ్వరైక్యమగుటె
ముక్తియనుచుంటిరి విరుద్ధము శ్రుతికిది
అప్రయోజనం బాభాసమై అసాధు
వై పరగునన శంకరుండతని జూచి । 39

నిత్యసత్యమై మోక్షంబు నిశ్చలమగు
కర్మచే కల్గుముక్తి తాత్కాలికంబు
ఇంతకుభవన్మతంబునయేది ముక్తి ?
స్పష్టమొనరింపుడోయన బ్రాహ్మణుండు ॥ 40

ఆత్మ నిత్యమది యనాదికర్మనిబద్ధ
మగుచు జీవపాశమందు నలుగు
పాశముడుగనాత్మ స్వర్గ ఫలప్రాప్తి
పొందు తెలియనిదియె ముక్తి మరియు. 41

కర్మచే బంధనంబడగారు కాని
జ్ఞానమిటసుంతయున్ సహకారికాదు
నిత్యనైమిత్తిక విధి వినిర్మితమగు
కర్మకాండచే మోక్షంబుకలుగుననగ ॥ 42

బంధముడుగ మోక్షంబు సంప్రాప్తమగునె ?
అయ్య ! బంధవిముక్తికై యాచరింప
నెన్ని కర్మలు వలయునో యెన్నగలమె ?
అంచు యతిరాజు గృహపతినల్లజూచి 43

బహువిధాత్మకంబైన యీ బాధలెల్ల
ఒక విధంబగు కర్మచే నుడుగ గలదె ?
బహువిధంబగు కర్మల వచ్చు ముక్తి
క్షణికమౌగాక శాశ్వత సౌఖ్యమిడునె ? 44

కర్మచేతనే మోక్షంబు కలుగునంచు
ఖచ్చితముగ బల్కు విధి వాక్యంబులేదు
బంధముడిగిన మోక్షము ప్రాప్తమనుట
భ్రాంతియే గాని సత్యమై పరగదయ్య ॥ 45

కర్మ, పరిణామ వాసనా ఘనతరేచ్ఛ
లే తరచగ పరస్పర ప్రేరకములు
చక్రనేమిచరంబుగా సాగువీటి
చే మది విశుద్ధమౌగాని సిద్ధిగాదు ॥ 46

కర్మచే జన్మ ప్రాప్తి వికార సంస్క
రణ చతుష్కంబు ప్రాప్తమౌ ద్రవ్యమందు
కాని యీ బాధ లేవియు కల్గవాత్మ
కదియనంతమై అమలమై యచ్యుతమగు ॥ 47

కర్మలెల్ల యీ జీవికే గాని, ఆత్మ
నెంత మాత్రము స్పృశింపవెఱుక గలుగ
జీవపాశము తనకుదా ఛిన్నమగును
అంతనాయాత్మ బ్రహ్మ మంచనుభవమగు ॥ 48

ఇట్టి జీవేశ్వరైక్యంబునే మహీసు
రాగ్రగణ్యులేరీతిగా నప్రమాణ
మందురా? అవిచారరమణీయముతమనుడి
పూర్ణపాండిత్యమనుభవ పూరితంబు ॥ 49

పాండితీ ప్రజ్ఞతో పాటు బ్రహ్మ మెఱిగి
బ్రహ్మ సూత్రంబులన్ కూర్చు బాదరాయ
ణుండు లోకవిఖ్యాతకీర్తి మండనులగు
శ్వేతకేతులుద్ధాలకశ్రేష్టులెల్ల 50

ఏక కంఠంబుతోవచియించి యీాయ
భిన్నతత్త్వమున్ మన్నించి రున్నతముగ
జనక శుకయాజ్ఞవల్క్యులకనుభవ మగు
అనుభవాద్వైత మిందుబోనాడదగునె ? 51

ప్రాజ్ఞుడా ! ఆత్మ కర్మనిబద్ధమంచు
బల్కుచుంటిరే యిది జీవభావమందు
కల్గునే గాని నిత్యాత్మకంటదెపుడు
జీవ యీాశ్వరస్థితిగతుల్ చెప్పెదవిను. 52

తరచ కారణోపాధిచైతన్యుడీశు
డఖిల రూప కార్యోపాధులలముచేత
నంబెజీవి యుపాధులు నాశమంద
నింక భేదమే లేదు జీవేశ్వరులకు 53

కారణంబాత్మ కార్యమాకాశమదియు
దశదిశావ్యాప్తమై అనంతమయి పూర్ణ
మైనెగడె యిక కారణంబైన యాత్మ
ఎంతపూర్ణమో సూక్ష్మమో ఎఱుగనగునె ? 54

అక్షిదోషాన ఒక్క సుధాకరుండె
ఇర్వురగ కంటబడురీతి యేకమైన
ఆత్మ జీవేశ్వరులగ మాయావృతమగు
బుద్ధిదోచు మిథ్యాజ్ఞాన పూరితమిది ॥ 55

ఘటమఠాదియుపాధులుకరగిపోవ
అంబరంబఖండమయినేకావృతమగు
నటుల, దేహేంద్రియయుపాధులడగినంత
ఏకమేవాద్వితీయమై యెసగుబ్రహ్మ ॥ 56

నిర్భయ జ్ఞాన రూపమౌ నిర్వికార
జీవుడీశ్వరుండై భేదభావముడుగ
జాతి నామాశ్రమాదుల సర్వమడచు
జ్ఞానమంది 'జీవేశ్వరైక్యంబుగాంచు 57

అద్దమున సత్యమనిపించు నాత్మముఖము
భంగి; బుద్ధిదోచెడి చిదాభాసుడాత్మ
గా ప్రతీతుడౌ గాని, నిక్కంబుకాదు
హానివృద్ధులే లేవు సత్యాత్మకెపుడు 58

రాగితోచేయు దివ్య విగ్రహములెల్ల
రాగికంటె భిన్నముగ అరాధితములు
ఆత్మనుండియావిర్భూతమౌ జగంబు
భిన్న సంస్కృతిరూపాల మన్ననగను ॥ 59

రాగితో జేయు జీవేశ్వర స్వరూప
ములు నశించినా రాగికి ముప్పు రాని
కరణి జీవేశులైక్యమై కరగిపోవ
అద్వయంబగు బ్రహ్మకు హానిలేదు 60

క్షీర నీర వివేకంబు చెందు హంస
కరణి సదసద్వివేకంబు కలిగి తన్ను
దానెరింగి అనాత్మకు తగులుకొనని
పరమహంస యీ కర్మల బట్టుబడడు ॥ 61

తమమునన్ చోరుడై దోచు స్థాణువున వి
కారమన్నది కల్లనే కల్లనిగతి
బింబమునకు వికారంపు వెతలులేవు ।
నిర్వికారాత్మ సర్వథానిర్గుణమది 62

స్థాణువే దొంగకాడను జ్ఞానమొదవ
తస్కరుండను భయమెట్లుదట్టు ?నటులె
ఆత్మరూపావగతి కల్గినంత విశ్వ
మడగు దానసంసారభయంబడంగు ॥ 63

కనపడదుగాని సర్వమున్ గాంచనేర్చు
వినబడదుగాని సర్వమున్ వినగనేర్చు
తలపులకు చిక్కదే గాని తలచునెల్ల
నదియె యాత్మ యంతర్యామియై వెలుంగు 64

చెవికి చెవి వాక్కునకు వాక్కు జీవమునకు
జీవమై జడ ప్రకృతికి చేతనాప్ర
దమగు సచ్చిదానందమున్ దలపతరమె ?
అనుభవైకవేద్యంబగునాత్మ ననగ ॥ 65

చక్కని ఉపమాన శక్తితో జీవేశ్వ
రైక్య మహిమ బ్రహ్మమనుచు దెలుపు
మే కవిత్వ రుచుల మెచ్చదగును కాని
సత్యమగునె ? ద్వైతజ్ఞానజగతి ॥ 66

ఆ మాటలకున్ యతిసె
మోమ్మున చిరునవ్వు మెరయ బుధులెరుగంగాన్
మామకమతంబనుభవై
కామృతమగు బ్రహ్మసదృశమౌ కైతయనన్ 67

బ్రహ్మ సదృశమగును కాని బ్రహ్మమగునె?
అనుభవమ్మును చర్చింప అలవి యగునె ?
వాఙ్మనములకతీతమౌ బ్రహ్మమెటుల
జీవుడగు లేని మీ మాయ చిత్రమనగ 68

వింతకాదు మీ మాటలో విశ్వరూప !
సహృదయుడనుభవానంద సరసిదేలు
కాని మఱిమఱి మాయయే క్రమ్మ తెరలు
తెరలగ రసికుడానంద తీర్థుడగును ॥ 69

మాయ చిత్రమిత్యర్థమున్ సేయగాదు
ఇది విలక్షణశక్తిచే నెదుగు బ్రహ్మ
వలె యనాదియై సృష్టి స్థితి లయలకు పు
నాదియై అంత్యమైపోవు- జ్ఞానమందు ॥ 70

వాఙ్మనః ప్రాణబుద్ధులపట్టుపడిన
ఆత్మకూటస్థ బ్రహ్మమై అలరు ప్రత్య
గాత్మ రహితమౌ దేహేంద్రియాదులెరుగ
శవమసహ్యమై భయదమై జడత వేచు ॥ 71

కర్మఫలబాధ్యుడై జీవి కాయకేంద్రి
యావరణపంజరస్థుడై అడలుచుండు
దేహమే ఆత్మయంచు బుద్ధి భ్రమింప
జేయు విక్షేపశక్తియే మాయ దలప ॥ 72

గాఢ నిద్రయందు కాలంబు బంధియౌ
వాఙ్మనములు ప్రాణ పంచకంబు
తేజమాత్మఁజేరి తెలియక క్రమముగా
సూక్ష్మ శక్తియందు సూక్ష్మమగును ॥ 73

తేనెపట్టులోని తేనె యేపూవుదో !
ఈ జలధిజలంబు లేనదులవో !
ఆత్మలీనమైన యఖిలజీవుల తత్త్వ
మొక్క బ్రహ్మమగుట నిక్కమయ్య ! ॥ 74

చీమయో ! సింగమో ! యెల్లజీవకోటి
నామరూపగుణక్రియల్ నాశమంద
అయనంతచైతన్యమందైక్యమగుచు
ఆత్మయేబ్రహ్మమైజగద్వ్యాప్తి చెందు ॥ 75

మఱ్ఱి విత్తు దెచ్చి మఱిమఱి భేదింప
శూన్యమగునుకాని శూన్యమందు
విపులవృక్షమెటులవిరియు ?సూక్ష్మంబులో
సూక్ష్మమాత్మపూర్ణ శోభ దనరు ॥ 76

కరగినలవణంబుకన్పింపదేగాని
తజ్జలరుచిదాని తత్త్వమెరుగ
వచ్చు, కాన అనుభవజ్ఞానమే బ్రహ్మ
మనుభవంబు రసికుడందగలడు ॥ 77

ఎంత నిష్కామ కర్మనుత్కృష్టుడైన
భేదభావంబు పూర్తిగా విడువకునికి
జీవి సాయుజ్యముక్తినార్జింపలేడు
జయవిజయుల చరిత్ర దృష్టాంతమిందు ॥ 78

కర్మకల్గనంతకాలంబు సాయుజ్య
ముక్తిలేదు ముక్తి పొందుటనగ
ద్వైతముడిగి జన్మదాల్పకుండుటయె అ
ద్వైతిమరల జన్మదాల్పడనగ 79

తత్త్వమసి మహావాక్యార్థతత్వమునకు
యతికులశ్రేష్ఠులిచ్చిన వ్యాఖ్యయిదియె?
అంచునర్మగర్భముగ హాస్యంబు సేసి
మండనుడు పూర్వమీమాంస పండితుడట ॥ 80

ఆత్మచే అనాత్మయలరారుటెట్టులో?
శూన్యమందు పూర్ణుజూచుటెటులొ !
వివిధ జీవులు తుది విశ్వాత్ముడౌనను
వ్యాఖ్య గగనపుష్పమౌను గాదె ? 81

హూంక్రియా శబ్దవేదమంత్రోక్తులు జప
యోగ్యమై ఫలప్రదమగుచుండు గాని
అర్థరహితమౌ తత్త్వమస్యాది సూక్తు
లెరుగ పరమ ప్రమాణమై పరగవనగ 82

అగ్నిచేబుట్టు వేడి ఘటాంతరమగు
జలపదార్థాలనుడికించు సరణి ఆత్మ
యే మనోబుద్ధి చిత్త దేహేంద్రి యాదు
లంటియంటక చైతన్యమందజేయు ॥ 83

జపమునకు మాత్రవచ్చు బీజాక్షరములు
కామ్యకర్మలకుచితమౌగాని, భేద
భ్రాంతి చెడ తత్త్వమసి మహావాక్యమేజ
హదజహల్లక్షణమున నిత్యార్థ మనగ ॥ 84

యతివరా! యజ్ఞమున తత్త్వమసియనంగ
నరుని యీశ్వరుండన్న సందర్భమునకు
తగిననుతియౌను గాని సత్యంబుకాదు
బ్రహ్మజీవులకైక్యముపట్టదిచట॥ 85

ఐక్యసూచియేగాని ఐక్యఫలసిద్ధి
కనువుగావిధివాక్యంబునరయమనగ
రవినిబలికంబములనుస్తోత్రంబుసేయ
కర్మకేవిధివాక్యంబుకల్గుచుండు 86

జ్ఞానకాండలోనిట్టిఅజ్ఞానిబద్ధ
వాక్యమనవసరంబన బ్రాహ్మణుండు
బ్రహ్మభావంబుజీవునిపైపరచెడి
క్రమమిచటదెల్పుగాని, ఐక్యరతిలేదు॥ 87

సచ్చిదానందలక్షితస్వామియైన
బ్రహ్మమున కవిద్యాబలప్రావృతుడగు
జీవికన్యోన్యసాదృశ్యభావమరయ
అన్నమేబ్రహ్మమనబ్రహ్మమన్నమగునె? 88

నాగమీరువాక్రుచ్చినట్లరయ జీవ
యీశ్వరులకుభేదముపాధికృతమెరుంగ
ఎఱుకకల్గ ఆయజ్ఞానమింకు నంత
రెండునొక్కటైబ్రహ్మమఖండమగును॥ 89

విప్రకులవర్య!భేదంబుభేదభావ
మఖిలదుఃఖములకుమూలమౌఅవిద్య
క్రమ్ముచుక్రియాతాంత్రికకాండమందు
తొలగితాత్కాలికంబుగ తోచుమరల ॥ 90

కానవిధివాక్యములకర్మకాండ నృపుని
రీతిశాసించు గానినివృత్తివస్తు
తంత్రమగుటచే నిట్టిబంధంబులేదు
ఉపనిషద్వానమొకటియే నుత్తమమన॥ 91

ద్వాసుపర్ణాయనెడి శ్రుతి వాక్యమందు
**కర్మఫలభోక్తజీవుడైక్రాలనొకటి**
**రెండవది** కర్మసాక్షినిర్లేపుడిచట
బ్రహ్మజీవులభేదమే స్పష్టమనగ 92

కర్మఫలభోక్త బుద్ధియేగాని జీవి
కాదు జీవి నిర్లేపుడై క్రాలెనిచట
అనగ బుద్ధికి భోక్తృత్వమంటగట్టు
ట శ్రుతి విరుద్ధమంచు మందనుడుబలుక॥ 93

అయ్య!పైంగరహస్య బ్రాహ్మణముచూడ
ద్వాసుపర్ణాయనెడి శ్రుతివాక్యమునకు
బుద్ధిజీవులభేదమే స్ఫుట మొనర్చె
బ్రహ్మజీవుల మాటయే పలుక దనగ 94

యతివరా! యిదే పైంగ రహస్యమందు
సత్వముశరీరమైజీవశబ్దవాచ్య
మయ్యె క్షేత్రజ్ఞపదముబ్రహ్మపరమయ్యె
బ్రహ్మజీవుల భేదమే స్పష్టమనగ॥ 95

కాదుకాదుమీమాంసి!పైంగమున సత్వ
పదముచిత్తమున్ క్షేత్రజ్ఞపదము జీవి
కన్వయమగుగౌణంబు బ్రహ్మపదమిందు
చిత్తజీవుల భేదమే చెప్పెననగ॥ 96

మండనుడు తత్త్వమసివాక్యమహిమదెలిసె
తెలిసెఅయహంబ్రహ్మాస్మి దిట్టతనము
గళమునందున్న పూదండకందిపోయె
జీవుడే బ్రహ్మ మగుచుంట చిత్తమెఱిగె॥ 97

శంకరుడుసురేశ్వర! యని సంతసమున
చేయిసాచె ఉభయవాణి చేరవచ్చి
భిక్ష కై భక్తినిరువురబిలిచె వార
లన్నపూర్ణాప్రసాదంబునందుకొనిరి॥ 98

సచ్చిదానందమె గురుడై వచ్చెననగ
మండనుడు పదవాక్యప్రమాణశబ్ద
బ్రహ్మమితడంచు బుధవరుల్ ప్రణుతి సేయ
శంకరుడు శంకరుండని జనత మ్రొక్కె॥ 99

నిత్యమాంగల్యలక్ష్మియై నెగడునుభయ
భారతి స్వస్వరూపానుభావమంద
దలప,యతి వనదుర్గమంత్రావహమున
దివికెగురనీక బంధింప దేవికినిసి 100

శంకరా!నీమహత్తర శక్తి మంత్ర
మందభివ్యక్తమై కర్మలందు మరల
తగులుటరయ, శంకింతు నద్వైతసిద్ధి
నిన్నుసర్వజ్ఞుడంచు మన్నింపలేను॥ 101

వాదమున చమత్కారివై పతినిగెల్వ
చాలదనుభవజ్ఞానంబుసర్వమెఱుగ;
నన్ను గెల్చినగాని పూర్ణంబుకాదు
విజయ మతని యర్ధాంగినై వెలసితినన॥ 102

యతిని పిన్నవాడ నహమెల్ల తొలగించు
అంబవంచు మీ సహానుభూతి
కోరిమిమ్ము నిల్పుకొనచూచితే గాని
బందిసేయుమంత్రవాదిగాను॥ 103

అనగ చాలునయ్య అద్వైతవాక్యముల్
యతివెయైన వాదివైతివేల?
విద్యలందు పిన్న పెద్దలేకాదు స్త్రీ
పుంవిభేదమనుట పొసగదయ్య 104

వాదమున గెల్తువా, సరి, కాదు కూడ
దనిన, నాపతిన్ నాకువదలి యథేచ్ఛ
నీవు నీదారి పొమ్మని, నిష్ఠురంబు
లాడ,బ్రాహ్మముఖము చూచి యతివరుండు॥ 105

దృఢమనస్కుడై బల్కె, వాదింతునంచు
మరలవిద్వన్మహాసభ మండనుని స
మక్షమున మొదలయ్యె, నధ్యక్షురాలు
వాదియైప్రతివాది దౌర్బల్యమెరిగి 106

ప్రకృతి పురుషుల సుమనోను రాగ జనిత
కళలు,కాలానుగుణముగాకలిగి,షోడ
శీ ప్రపూర్ణమై, బ్రహ్మైక్యసిద్ధి కూర్చు
ఎప్పుడెప్పుడెట్టెట్టులో? చెప్పుమనగ॥ 107

పసిడి శశి పదునార్వన్నెలసఖి ప్రకృతి
కళలుకాలము శక్తీశ్వరులు తుది మొద
లేవియును గాని బ్రహ్మకే యీవిమర్శ
అన యఖిలముబ్రహ్మానందమౌనుగాదె? 108

తనువు జ్ఞాన శిఖల ధగధగ వెలుగ నా
తత్వమవనికెల్ల సత్వమయ్యె

ఆ యనంగుని కళ లాద్యంతమున్ దెల్పు
శాస్త్రచర్చ బ్రహ్మచర్చగాదె? 109

అనగ కేవలముజిగీషకై పెనగెడి
ఈమెతో వృథా వాదింప క్షేమమగునె?
సుంతయోచించి శంకరుండంత చెల్లి!
ఉత్తరంబిత్తు నెలకంచు నురికె వనికి॥ 110

నవ్వుకొనె నాటిజనమెల్ల నాతి యుక్తి
యుక్తమౌప్రశ్న, సమయోచితోక్తులకును
మెచ్చిసాధ్వని సన్యాసి వచ్చునే? యి
క నెలకివియేటి మాటలు కదలుడంచు॥ 111

జనులుదమతమయిండ్లకు సాగ;చిన్న
వాడసాధారణ ప్రతిభాన్వితుడని
ప్రాజ్ఞులు తలంప;పల్కులబడతి కనులు
మందహాసంబుతో చూచె మగనివంక॥ 112

ఏదియెరిగిన సర్వము నెఱుగవచ్చు
దాని నెరిగిన బ్రహ్మవిద్యా స్వరూపి
అనుభవంబునగెలువ తా వ్యవధిగోరె
తథ్యమీగురుని జయంబు తప్పదింక॥ 113

ఈ గృహస్థాశ్రమత్యాగమే హితమగు
కాని, దేవి శరచ్చంద్రికాస్మితాస్య
మద్దువడె,బాల సూర్య ప్రభాళి రాక
తప్పునేయని గృహపతి తప్పుకొనగ॥ 114

మౌన గంభీరమూర్తియై మసలుకొంచు
సతతమంతర్ముఖుండైన పతినెరింగి
ఉభయ భారతి వైరాగ్యమూహసేసె
పతిపదం బే సతికి పరబ్రహ్మ పదము 115

# అద్వైతసిద్ధి

చంచలాచంచలమె జగచ్ఛక్తియయ్యె
పూ బరిమళంబులే మధు పూర్ణమయ్యె
మధురగాంభీర్యగుణములే మర్మమయ్యె
ప్రకృతి పురుషులే సమరసాద్వైతమయ్యె

పాలిచ ముఖంబులన్ వంచి పలుకు లుడిగి
వెంటబడు శిష్యులన్ చూచి వెతలనెరిగి
శంకరుడు ధీరగంభీర జలధియగుచు
అనుభవముగాని విద్య విద్యయనలేము॥ 1

తల్లి వైదేహ శాస్త్రమున్ తడివె యతిశ
రీరి కీశాస్త్రగంధమే లేదు కాన
అన్యదేహంబుచే దీని యంతుతెలిసి
యంటియంటక వాగ్వాదమందుకొందు 2

అతులమగు దివ్యదృష్టి బ్రహ్మాండభాండ
మరసి వచియించె పద్మపాదా! వనమున
కాలవశుడయ్యె నమరనృపాలు డతని
పైబడి అడలుచుండె ఆబంధుజనము॥ 3

ఆశరీరంబునన్జేరి యతనిసతుల
సుతుని రాజ్యంబు సరిదిద్ది అతనుకళల
దెలిసి శీఘ్రమే ఆత్మీయదేహమందు
కొందు నందాక రక్షింపుడిందుమేను॥ 4

పద్మపాదుడు దిగ్భ్రమ స్వాంతుడగుచు
దేవ! సంసార బంధమున్ త్రెంపలేక
ఆ త్రిమూర్తులే సతత మల్లాడుచుండ
లేని జంఝాట మేల కల్పించుకొనగ 5

విశ్వరూపుడు మండన బిరుదమున్న
అపర బ్రహ్మయే మీపదంబంటుచుండ
అతివ సేయు కుతర్కంబునందరకిట
దెలిసె విడనేటికో మీయతిత్వ మనగ 6

పామరుని రీతి బల్కకో! పద్మపాద!
ఓడుగెలుపుల మాటయే యూహతగుల
దఖిల మాబ్రహ్మమయముగా నాదరించు
వాని కీకర్మ జాలము బంధమగునె? 7

అస్కలితుడూర్ధ్వరేతస్కుడై సతత స
తీజన పరీవృతుండైన దేవకీసు
తుండు బ్రహ్మచారిగ జగత్పూజ్యుడయ్యె
ఆ త్రిమూర్తులీ కోవలో నలరుచుండ్రి. 8

కర్మ తల్లి జగతిగతి గమ్య మెఱుగక
తనుమనోధనముల దవిలిజీవి
నలుగు కాని ఆత్మబలమందు సచ్చిదా
నందు డంటియంటకిందె నలరు॥ 9

అగ్ని సంస్పృష్ట కాష్టలోహంబులెల్ల
అగ్నిరీతి భాసించుచున్నట్టు లాత్మ
యోగమున స్థూలదేహాదులుర్వియందు
ఆత్మగాదోచుకాని సత్యంబుకాదు॥ 10

నాడెతల్లిని విడిచి సన్యాసినైతి
నేడు తల్లిని దెలియ చింతించుచుంటి
ఆమె ప్రశ్న యిటకుతర్కమౌను మనకు
కాని సముచితంబనుభవజ్ఞానులకిల॥ 11

పిరికి యౌచు దూరంబుగా పరువులిడిన
జ్ఞానియగునె? తామరపాకు జలకణముగ
యంటియంటక సంసారమందుదేల
కర్మలందున మోక్షంబు కలుగునయ్య॥ 12

ఇంతకు మదీయ సూక్ష్మదేహి యమరుకుని
దేహమగు, బ్రహ్మచర్యంబు దెబ్బ తినదు,
వత్తు శీఘ్రమే, మేనుకాపాడుడంచు
యతి నృపతిబాహ్య దేహంబునందు సేరె॥ 13

నిద్రమేల్కొన్న రీతి యానృపుడు కదల
ఆసతీసుత పరివారమంతులేని
సంభ్రమానంద చకితులై స్వామి నరసి
గడిచె గండమంచూర్పుల విడిచిరంత॥ 14

రథికుడై నగరికి యతిరాజురాగ
ప్రజలు మంత్రులు సేనాధిపతులు నాగ
రిక పురోహిత వ్రాతము ప్రీతితోడ
స్వాగతము బల్కె నాత్మీయ జనవిభునకు॥ 15

యతినృపతి ధర్మ పాలనారతుడుకాగ
అర్చనోత్సవములు సాగె నాలయాల
వేదవిహిత కర్మలు ధరన్ విస్తరించె
అదును దప్పక పదునయ్యె అవనియెల్ల 16

అమరుకసుతని రాజ్య పట్టాభిషిక్తు
చేసె రాజ్యలక్ష్మికి ముప్పుమాసిపోవ
వివిధ వర్ణాశ్రమోపేత విధుల నడిపె
శాంతి సౌఖ్యముల్ దక్క రాజ్యరమవెలిగె॥ 17

బొక్కసంబు నిండె పుష్కలంబుగ, రామ
రాజ్యమయ్యె ధరణి, రాజనీతి
రూపుగట్టగ యతిభూపతి వర్తించె,
మంత్రుల హృదయమనుమానమూనె॥ 18

బ్రతికి వచ్చుటే వింత యీ ప్రభుని వర్త
నంబపూర్వమైయుండె మనంబెరుంగ
దివ్య శక్తులీ యమరుక దేహమయ్యె
శంక లేదంచు లోలోన సచివులుండ॥ 19

చల్లని కృపాకటాక్షంబు, సంతతదర
హాసవదనంబు, మృదుమధురారవంబు
పట్టు విడుపుల ప్రాభవ స్పందనంబు,
లమృత శక్తులీ యమరుక నందుమెరసె॥ 20

చూపులో శాంతి చేతల శుభకరంబు
పలుకు లనుభవామృతరసగుళికలౌర!
బ్రతికివచ్చిన స్వామిచర్యలెమముబ్రతి
కించెనని సఖీవ్రాత మానృపుని కొలిచె॥ 21

సతత మంతః పురస్త్రీల సన్నిధి యతి
హావభావవిలాసాల యంతు తరచు
సరస సరసీవనాంత సంచారి యగుచు
మధుర బింబాధరోక్తుల మనసు లెరుగు॥ 22

చేరవచ్చు రసాంగుల చేష్టలెరుగు
పలుక నేర్చు ప్రగల్భల భావమెరుగు
కౌగిట మృదుజీవుల రసయోగమందు
రాజు ఋషియయ్యె వైదేహరాజ్యమందు 23

అనుభావవ్యభిచారీ
గుణముల రూపించు కుసుమకోమల కావ్యాం
గన రససాహిత్యమె యతి
కనుభవ సాహిత్య మయ్యెనంతఃపురిలోన్॥ 24

మంగళ స్నానమొనరించి మడుగుపట్టు
గట్టి పైడి నగలు పెట్టి పట్టమహిషి
కంటనీలోత్పల ప్రభల్ క్రాల త్రిపుర
సుందరీ కళల నెరప చొక్కె నృపుడు॥

పెదవి నరవిచ్చు నెఱిసంజ; నుదుటమెరయు
చంద్రకళ; కొప్పుజాజిపూసౌరభంబు;
పైట కస్తూరిగంధమ్ము బయలు బరుప
రసబుషి గనె కామేశ్వరీ ప్రాణకళల

పైట జారెనో! పదముల పట్టు సడలె
నో! కటిదుకూలము చెదరెనో! నుడితడ
బడెనొ! చంచలాచంచల ప్రభ రసాంగి
కాగ భగమాలినీ కళల్ గాంచె ప్రియుడు॥

నెలత నెలరేఖరీతిగా నిండి, నిండు
కళల పౌర్ణమిన్ చిద్రూపిగా స్ఫురింప,
ఈ మహారాజ్ఞియే జగచ్ఛృష్టి సంస్థి
త లయలకమృత లక్ష్మిగా దనరుచుండె

హృదయ మమృత కుంభంబులై, యెదిరి నోర్వ
గలవరారోహియే, యుర్విని లుపు శక్తి
త్యాగ సౌభాగ్య సహనైక తత్త్వమంచు
నాతడానంద యోగియై ఆత్మ మఱచె॥

ముఖము బిందువై కుచయుగంబు జగమలర
సూర్య చంద్ర బింబంబులై సుధల నింప,
ఆహరార్ధ మైక్యస్థితి నాత్మకాగ,
శ్రీమహా విద్యయే యిట స్త్రీగ నిలచె॥

ఆయకార మదృశ్యమై యవతరించు
ఓంక్రియాశక్తియే తపంబొప్ప ముందు
షోడశకళా ప్రపూర్ణయై కూడవచ్చె
ప్రాంజలి ఘటింతు చైతన్య లక్ష్మికిందు॥ 31

మాయయే అమ్మగా దృశ్యమైమనుపగ
అమ్మయే మాయగా నదృశ్యమగుచుండె
రెంటికిని మూల మోంకార హృదయమయ్యె
చంచలాచంచల ప్రభసత్యమగుచ్చె॥ 32

కళలు కాలాను గుణముగా కన్నెయగును
కన్నె త్యాగాగ్నిలో అంబగా వెలువడు,
అమ్మ విపరీత గతిని మాయయగుచుండె,
ఈ మహామాయ నెఱిగెడి యీశుడెవడొ! 33

అనుభవైక వేద్యమౌ జగచ్ఛక్తిని
శశవిషాణమని విరసమొనర్ప
రాదిది సదసద్విలక్షణంబీ మాయ,
నిరతమాత్మ వేదినృత్యమాడు. 34

బ్రహ్మ వలె నిత్య సత్యమై పరగదు, గగ
న కుసుమమనగ సర్వ శూన్యంబుకాదు,
సత్యమీవ్యావహారిక జగము క్షణిక
మగుట, నానందమీద్వైత మందు మెరుపు॥ 35

మల్లెపూ పాన్పుపై మణిమందిరాన
కలలుగను, ప్రియునికపోలముల కపోల
మంటి చుంబింప, పుల్కల గంటుకదిరి
గన్నుమను ప్రేయసిన్పతి గౌరవించె॥ 36

మ్రోగె మొలనూలు, గుబ్బల మోతవడకె
లేనడుము, నిండునెలమోము తేనె లొలుక
అరుణరాగాంబర శ్రీల అతివమెరసె
అతనుకళలమృత తరగలై పారలగ

చిగురుటాకుల బడి, జాయ శీతకిరణ
మో యన ద్రవించి, తూలుపూబోడిని, విభు
డమృత హస్తంబుతోబట్టి ఆదరించె,
చిలుక సారథి శరముల చికిలిజేసె॥

రసవిలోల భావంబులు ప్రాణమగుచు
మేల్కొను మనోనురాగమే మేనుకాగ
చేరవచ్చిన అమరుక శ్రీని జూచి
అయ్యమరుకదేహి స్తబ్ధుడై నిలచుచు॥

ఆకసం బనిల మనలమప్పు పృథివి
మనసు సర్వమొకటియై త్రిగుణముల పరి
ణామ భాగ్యమే యీచిదానందలక్ష్మి
చూరగొనచేరవచ్చెను సొంపు నింప.

నిలచు భంగిమ నుడిరీవి నీలి నేత్ర
ముల చురుకుదనంబీ లోకముల జయించు
ప్రాభవస్వరూపమె పరబ్రహ్మశక్తి
యంచు పరవశించినృపుండు జేర నతివ

చేతుల విదల్చె, కుచ్చిళ్ళు చెదరగొట్టె,
కురులుకసరె, పాదంబులే శరణుకాగ,
అశ్రుముత్యాలు ప్రియునకు హారమయ్యె
ప్రేయసీ లీనుడైపోయె ప్రియనృపుండు॥

తనువు తనువులో లీనమై స్థలమడంగె
చూపుచూపులో చేరగ రూపుతరిగె
ఆత్మ యాత్మలో గలియ భావాబ్ధులింకె
రెండు నొక్కటై ఆయొక్కటుండె నెటులో॥ 43

అధరమధుపాన భృంగమై ఆడుకొనును
కనక కలశామృత చకోరిగ విహరించు
అద్వయానందదేహియై అమృత కళల
అమరుకయతి చిదానందుడై రమించె॥ 44

ముంగురులు ముఖసంజదోబూచులాడ
కన్నులరమోడ్పు కలువమొగ్గలను గెలువ
నాల్గు పాదాల ధర్మమే నాట్యమాడ
శయ్య అద్వైత సిద్ధికి సాక్షియయ్యె॥ 45

చూడరాని జగంబుల చూపె కనులు
దెలుపరాని మాధుర్యమే దెలిపెమనసు
నేర్వరాని మహావిద్య నేర్పె ప్రకృతి
పాంచభౌతిక సృష్టియే బ్రహ్మమయ్యె 46

పెదవి చిట్లినా మధువే, వదనము గంట్లు
వడిన కమ్మదనమె, పైటచినిగి
నా పయఃప్రవాహమే పయిబడ, నీర
సొంగినలిగిన, అమృతాత్మయయ్యె॥ 47

కళలుకాలము చంద్రుడు కమ్మగాడ్పు
మధురమోహన లావణ్య మానినుల క
లంచెనేగాని తాను కలంగడయ్యె
కర్మసాక్షిని జగములు కలచనగునె?॥ 48

విడని బంధంబులన్ విడిపించుకొనుచు
జీవులాబరమాత్మలో జేరుకరణి
అంతిపురకాంత లాప్రభునాత్మకలియ
యతినృపతియంటి యంటక సాక్షి యయ్యె

ఆస్థితప్రజ్ఞుని స్పర్శ నంతిపురము
నిత్యచైతన్య కల్యాణ నిలయమయ్యె
దేశకాలద్వయంబునే తెలియదయ్యె
జీవలోకమే యద్వైతసిద్ధి పొందె॥

తెరలు తెరలగ సౌఖ్యాబ్ధి దేలునాటి
ప్రౌఢకాంతులు శంకించి ప్రభునపూర్వ
చర్య లజ్ఞాతకౌతుకోత్సాహ మొసగె
నృపుడు కాడు మహామహనీయుడితడు

నాటితూపు లీచూపుల నాటవయ్యె
ఆ,దుడుకుదనం బీనడలందులేదు
ప్రణయకేళిలోన అనుభవంబపూర్వ
మైయనిర్వచనీయమై హాయిదేల్చె॥

పలుకునేగాని భావాల పట్టుబడడు
దరియునేగాని యెదకేమొ దక్కడయ్యె
కలియునేగాని ఫలముల గాంచమౌర!
ఈతడెవ్వడో మహనీయుడింటబడియె॥

మౌనియైెమమ్ము మాటాడ మరులుకొలుపు
స్తబ్ధుడైమమ్ము చైతన్య సరసిదేల్చు
అందకే ఆత్మ కానందమందజేయ
పొత్తుదేహిదేహాలకే పొసగదిచట

మదితలకొను చేష్టల శిరంబల్లవంచి
పెదవినంటిన లేనవ్వు చెదరుచుండ
పలుకనేరని ప్రౌఢకాంతలగభీర
భావచర్యల కాశ్చర్యపరతమునుగ 55

అనుమానంబీరీతిగ
మనముల గాపింప సచివ మండలియున్ మా
నినులముఖవైఖరులెమా
యనుమానము దృఢమొనర్చెనంచును వారున్॥ 56

ఎటులైన యిమ్మహాత్ముని
యిటనే బంధింప అమరనృపుడమరుండౌ
పటుతరదేహమునన్ ది
క్తటులంటయశమలమునని తలచెడిదరిలోన్ 57

నర్తన స్త్రీలలో జగన్నాటకంబు
మధుర నాదంబులో ఋతంబర మహత్తు
భావరాగ తాళముల ప్రపంచమైన
భారతిన్జూచె అమరుక బ్రహ్మయోగి 58

ఆయతి వరివస్యారహస్యం బెరింగె
కళలుబీజాక్షరములు చక్రములు మంత్ర
తంత్ర యంత్రాత్మిక ప్రభాతత్త్వ మెఱుగ
బ్రహ్మమొకటె యన్నింటికి పతకమయ్యె 59

అమరదేహి రాజహర్మ్యాంతర విహారి
యై నిశాంతచంద్రికాంబర రుచి
ననుభవింపు చుండ నాత్మకలచుపల్లె
పదము గాలి తెరలపై తరలగ 60

ఎవరు భార్య? పుత్రుడెవ్వడు?సంసార
మింద్రజాలమౌర! యెవరవీవు
ఎచటనుండి యెచటకేగెదో! ఏది ల
క్ష్యమొ! తెలియకిటపడిగాపువైతి॥

నిన్ను నీవెఱుంగ కిటుల నిలువదగునె?
పద్మగర్భంబునన్ చిక్కిబందివైతి
భ్రమర! అరుణోదయారంభ సమయమిదియె
త్వరపడుమ! నీ పదంబేదో! పట్టుకొనగ॥

ధనము చుట్టముల్ ప్రాణంబు తథ్యమంచు
మిడికిపడకుమా సర్వమామృత్యువు క్ష
ణంబులో హరించీకాపురంబు తిరము
కాదు నీవారలెవ్వరో గాంచుమనగ ॥

ఎచటనో! విన్నదీ యెలుగిపుడు గుండె
బట్టిపిండుచున్నది, పద్మ పాదురూపు
తెరలుతెరలగా కంటిముందె చలియించె,
నంచుగురుడటునిటు చూచి నాత్మనెరిగె॥

పనిదీరెననిన్నృపాలుని
తనువటత్యజియింపగ యతి తనువిట లేచెన్
దినముల్ లెక్కించెడి శి
ష్యనికాయము శంకరగురుసన్నిధిమూగెన్

అణగు నాశలే హఠాత్తుగ గురునితో
లేచి గట్టు తెగిన రీతి శిష్య
ల గురుభక్తి కన్నుల మొరవలై శివ
పాదయుగళి కడిగె బాష్ప జలము॥

దేవా! మీదేహస్థితి
మావెత కర్తవ్య దీక్ష మమువేచగ; కా
లావధి తలచి సనందుడు
మీవిధి నెరిగింపబోయె మిముతోడ్తేరన్ 67

తెలిసే వచ్చితినని శి
ష్యులకుశల ప్రశ్నల గురుడోదార్పగ, ప
ర్వులపై వచ్చి గురుపదం
బుల వ్రాలి సనందుడందు బోరన యేడ్చెన్ 68

పోయిన కార్యంబేమై
పోయెనొ! యేమేమి వెతలుబుట్టెనొ! మాయో
పాయుల జయించుటెటులో!
మాయావెతలెల్ల తీరు మార్గంబెటులో! 69

తెలియక తెలిపెడి వారిన్
దెలియక నెలనాళ్ళ గడువు తెగుచుండన్ చిం
తల మిమ్ము చేరవచ్చితి
పలికితినేమేమొ! పిచ్చి పదములు దేవా! 70

అంతనమరుడీల్గిన వృ
త్తాంతము విని మిమ్ము చేర తహతహ నిటకున్
గంతులపై వచ్చితి మ
చ్చాంతమిపుడు కుదుట బడియె క్షమియింపడనన్ 71

అన్నా! సమయోచిత సం
పన్నంబగు నీ పదము శ్రవణ శుభగంబై
నన్నిటకున్ నడపించుచు
మన్నన కలిగించె నీదు మార్మిక పదముల్॥ 72

సచ్చిదానందము ధవళ శ్యామలారు
ణాల వరుస వాణీచంద్రమౌళులెఱుక
పార్వతీపద్మనాభులు ప్రగతినీయ
పద్మపద్మజులానంద భాగ్యమిడిరి. 73

నడువండిక మాహిష్మతి
కడకున్ నిగమాగమార్థకల్పకవల్లిన్
మృడరిపు శాస్త్రంబున ఆ
మృడైక్యతత్త్వంబు చాటి మెప్పింపవలెన్ 74

పుండరీకాసనాసీన, పుల్లనేత్ర
అబ్జవదన, శబ్ద బ్రహ్మ మగుచు, నలువ
నలుమొగంబుల వెల్వడు నాదమే ధ్వ
నించె వేకువ స్వప్నమే నిజముకాగ॥ 75

భారతీదేవి రూపమే బ్రహ్మ మగుచు
నాల్గువేదాల నాల్కపై నాట్యమాడ
జీవకోటిని తరియింప జేయుకలయె
సత్యమనిపింప చూచెవిశ్వపతిని సతి॥ 76

ఎల్లరు మండన మిశ్రుని
యిల్లుంజేరగయతిపతి కెదురై వచ్చెన్
యిల్లాలు నుభయభారతి
అల్లననిజభర్త తోడ స్వాగత మీయన్ 77

దూర్వాసుని శాపంబును
సర్వజ్ఞుండై హరింప సనుదెంచిన ఆ
శర్వుండితడని మదిలో
బర్వగ పూర్వస్మృతియతివరుదిలకించెన్ 78

చిరునవ్వు చిందగ నుభయ
సరస్వతి వచించె అన్న! సర్వజ్ఞుడ వె
ల్లరహస్యము లెరిగిన శం
కరుడవు పరదేహివైన గారడి దెలిసెన్ 79

తాంత్రిక యోగరహస్యము
మాంత్రిక మహనీయశక్తిమర్మమెరిగియీ
యాంత్రిక జగమ్ము నడుపు స్వ
తంత్రుండవు నీకు సాటి ధరపై నీవే 80

పూర్ణ విజయంబు నీదయ్య! పుణ్యపురుష।
యని యుభయవాణి వాణియై అంబరమున
స్వస్వరూపాన నిలువ ఆచార్యుడు చకి
తాక్షుడై బాష్ప పుష్పాల నర్చసేసె॥ 81

అచ్చపునెల శిరము నందగింప నభయ
ముద్ర అక్షమాల పుస్తకంబు
కల్గునిన్ను మ్రొక్కకయె నొక్కపరి రావు
తేనెపాలు ద్రాక్షతీపినుడులు॥ 82

ఆగమజ్ఞానులో బరమాత్మమహిషి!
నిన్నువాణీ రమా ఉమానెలతలంచు
మ్రొక్కనీవో తురీయవై చిక్కకాత్మ
మహిమ మహినేలుకొను మహామాయవగుదు॥ 83

నిన్ను కొలచువాడు నిధుల విద్యల పొంది
హరికి బ్రహ్మకుపగయౌనురతిస
తీత్వమడచు దివ్య దేహియై తుది జీవ
పాశముడిగి ముక్తి పదము నందు॥ 84

రవికి దివిటీల తోడనీరాజనంబు
ఇందుజలముల శశికర్ఘ్య మిచ్చునటుల
నీరనీరధిన్ సంతృప్తి నెరపినటుల
తల్లి! నినునీనుడి పొగడి దనుపుననగ॥ 85

దేవి, శంకరా! నీకోర్కె దెలుపుమనగ;
యతికి కోరికలున్నవే అంబ! మాకు
దూరమైపోవు ద్వైతంబు కోరమిచట
పరము లేక యిహమునకు బలము గలదె?॥ 86

నీ బలంబండయైయుండ నిఖిల జగతి
బ్రహ్మమగును, సురేశ్వర ప్రణుతిగాంచు
ఇల్లుగాక, విశ్వంబునే యిల్లుసేయు,
ఈ జగత్కింకరుననుగ్రహింపుమనగ॥ 87

నా బలముకంటె నీభక్తియే బలమయి
బ్రహ్మమగునని గురుజూచి బ్రాహ్మి అన్న!
ఆత్మ బుద్ధికదృశ్యమై యఖిల జగతి
నడపు నట్టుల నీవెంట నడచివత్తు॥ 88

నీ విజయాభ్యుదయంబులు
నీవెనుకనెవచ్చు చుండు నిక్షేపంబై
నీ వేనాడనుమానము
తో వెనుదిరిగెదవా నాడె తొలగెద నేనున్ 89

కానీ నా సాత్విక కళ
యీనీ పీఠములు నిలచి నెల్లప్పుడు జ్ఞా
నానంద పదంబై ధ
ర్మానుష్ఠాన ప్రియుల కిహపరంబులిడున్॥ 90

అనియదృశ్యమై వాణి బ్రహ్మ పదమంద
విశ్వరూపుని భాగ్యంబు విశ్వమయ్యె
మండనుని బిరుదాఖ్యయే ముండిత శిర
మై గురుమ్రోల నాతండు సాగిలబడ॥ 91

శంకరుడు పరివ్రాజకాశ్రమవిధి కను
గుణముగా కావులిచ్చి దీక్షనొసగి ప్రణ
వోపదేశమున్ సేసె ముహూర్త మెరిగి
అంతమండనుడు సురేశ్వరాఖ్యుడయ్యె॥ 92

సకల మతముల కేకలక్ష్యంబుకుదుర
జనని సూచించు తత్త్వ ప్రచారమునకు
నలుగడల నిలిపె చతురామ్నాయపీఠ
ముల అఖండమై భారతి వెలుగులుమియ॥ 93

# మహాప్రస్థానము

నలుమొగంబులవెలువడు నాదమప్ర
తిహతమై నాల్గుదిశల బ్రతిష్ఠ కాగ
నాల్గు వేదవాక్యంబులన్ నలువరాణి
ఉపనిషద్బ్రహ్మమై భరతోర్వి నిలిపె

## మహాప్రస్థానము

భిన్న భిన్న భాషల ప్రజల్ వేరు పడిరి
భిన్న భిన్న వర్ణముల విచ్ఛిన్న మైరి
భిన్న భిన్న వర్గంబుల విరుగుచున్న
భరత ఖండమున్ దిద్ద శంకరుడుదలచె॥ 1

భిన్న మతముల నలిగి నిర్వీర్యమై ని
రస్తతేజమై నరజాతి క్రుంగుచుండె
భిన్నమందున్న నేకాత్మ విభునిగాంచు
కర్మయోగియే భక్తుడౌ జ్ఞానియంచు॥ 2

ఆసేతు శీతనగముల
దేశవ్యాప్తముగ తిరిగి తెలిసె గురుండా
యాసాంస్కృతి లక్ష్యపుసా
రాసారవిచార మొక్క బ్రహ్మంబనుచున్॥ 3

భేదమడగార్ప విష్ణుకు వినుతి సేసె
సురలనడపింప కౌమార చరిత మెరిగె
మూడు గుణము లెఱుగ త్రయీమూర్తి కెఱగె
వ్యాపకమగు విష్ణుపదమున్ ప్రణుతిసేసె॥ 4

సకల శక్తుల కాదిమశక్తియైన
మాతృదేవతన్కొలచె కుమారుడగుచు
నిర్గుణనిరంజనంబగు నిర్వికార
బ్రహ్మమైపోవ భజియించె పరమశివుని॥ 5

నియమనిష్ఠాగరిష్ఠుడైనిజమెరింగె
యోగ్యతానుసారంబుగ నుర్వి నేమ
తంబనుసరించెనా ముక్తితథ్యమంచు
షణ్మతస్థాపకుండయ్యె శంకరుండు॥ 6

సౌరశాక్తగాణపత్యశైవవైష్ణ
వాదిమతములకొకటె లక్ష్యమదిబ్రహ్మ
మంచు నాచార్య శంకరుండవని చాట
దక్షిణావనిచరియించు సమయమందు॥ 7

చిత్రమైన సృష్టి శ్రీశైలమైమల్లి
కార్జునుడుసుమంబు కాగ శక్తి
భ్రమరమైజగముల భ్రమియింపజేయ నా
స్థలవిశేషమరయ ఛాత్రులరుగ॥ 8

బ్రతుకు భయముకూర్ప వామమార్గంబున
స్వేచ్ఛనాటవికులు చెడుటెరింగి
సవ్యమార్గమందు చరియింప ఆస్తిక
క్షేమమాత్మదలచిశివగురుండు॥ 9

కొండ పైయోగవపహుడౌచు కూర్చొనంగ
భైరవోపాసకుండు కపాలమాల
గళమునందాల్చి శూలంబుకరతలమున
నిలువ మదిరామదవిలోల నేత్రుడగుచు॥ 10

వచ్చిసన్యాసి! నీకునద్వైతమనగ
తెలియునే? వట్టిమాటల దేలనేల?
సతతకాంతాసమాగమసౌఖ్యరతుడు
రుండమాలాధరుండు మారుద్రుడెరుగు॥ 11

ప్రళయతాండవ భైరవస్వామి యతడు
కాలకాలుడుత్రిపురారి శూలపాణి
అపరాత్పరునికిలనిన్నర్పణమొన
రించి నీశిరంబుమెదధరింతు నంత॥ 12

నీకు మోక్షైక లక్ష్మి సన్నిహితమౌను
మాకు సామ్రాజ్యలక్ష్మి సంప్రాప్తమంచు
ప్రీతి రుద్రుని సాక్షాత్కరింపచేసి
త్రుంచుమోదేవ! యీశివ ద్రోహిననగ॥ 13

పరమ శాంతస్వరూపియౌగురుని చూచి
చూచె రోషాగ్నిమందు కపాలధరుని
పలికె మత్ప్రతిరూపమౌ పరమశివుని
చంపలేనని క్రూరుని చంపి వైచె॥ 14

గురుడు మేల్కొనె కాపాలి శిరము త్రెళ్ళి
వేడిరక్తము గోటికి వెతను కూర్ప
శిష్యులన్చూచి యీకొండజీవుల మది
నమృత మొలకించుటే విధియనెడి వేళ॥ 15

పర్వతగుహలనుండి కాపాలి కోగ్ర
వర్గమేతెంచె భైరవ ప్రభుని పతన
మరసె,శాంతి సౌజన్యసౌహార్దమూర్తి
శంకరుని పాదసన్నిధి సాగిలబడె॥ 16

గురుకృప విశాల నయనాలవిరియవారి
మనము లజ్ఞాత సౌఖ్యసంభ్రమతచెలగె
వారిలో నొక్క డాజాను బాహువసిత
దేహి దరిజేరి మ్రొక్కి మీదృఙ్మహిమలు॥ 17

ఏమిచెప్పదేవా! శూలమేటికో క
రస్థలంబున నుండి జారదొడగెమది
మదిరపైబోదు మడతిపై మరులుగొనదు
స్వామి పాదాలపైబడ సంభ్రమవడు॥ 18

అన చిరునగవు దొనకాడ యతివరుండు
ఆకపాలియే మీయాత్మలందు నిలచె
విస్తృతారణ్యముల నడపించెమిమ్ము
భ్రామరీశక్తియేమీకుప్రాణపదము॥

అప్రతిహతంబు మీప్రభునాత్మశక్తి
బొమ్మలనుజేసె శిష్యషండమ్మునిచట
ఇపుడతడు పుణ్యలోకాల కేగుచుండె
విశ్వకళ్యాణ లక్ష్మికి విందుసేయ॥

వేదవిహితులయ్యువాదవివాదాల
క్రూరకర్మరులయి కూలదగునె?
శూలపాణులయ్యు శూలినేచూడరు
సాటిజనులజంప శాంతికలదె?

ఆదిమధ్యాంతమందొప్ప నాత్మధర్మ
మాత్రిశూలమైశివుని హస్తమున వెలిగె
భక్తులందేటికోదుష్ప్రవర్తనంబు
కుటిలతాంత్రికాచారముల్కూడదయ్య!॥

వీరవైరాగ్యసత్వమే విస్తరింప
మాలయౌగాని యదిరుండమాలకాదు
స్వార్థకామంబుల హరించు పాత్రగాని
ప్రజలవెఱపించెడి కపాల పాత్రగాదు॥

అస్థిమాలజడలు హస్తంబునన్పుర్రె
పట్టినంతనే కపాలివగుదె?
లింగధారియైన లింగితానౌనె?చ
క్రాంకితముల నొడల కాల్పదగునె?

మద్యమాంసముల ఉమాభక్తికుధురునె?
వేషధారి మనసు వికృతమగును
తనువు చెడునుకాని తాదాత్మ్యమున్కూర్ప
దంచు తిద్ది వారినచట నుండి॥ 25

సాగి సప్తగిరులసహస్రారమందు
కొనగజీవనదిగజీవకోటిప్రాక
శేషపర్వత ఫణిపణాశేషరుచుల
కనులమిరుమిట్లు కొలుప శంకరుడు చూచె॥ 26

కన్నులాకమలాక్షుని కనులగలియ
పరవశానందమూర్తియై ప్రకృతిమరచె
ఎంతకాలమట్లుండెనో యెవనికెఱుక
క్రమముగా బరిసర ప్రజ్ఞగాంచి గురుడు॥ 27

ప్రకృతి సౌందర్యజీవుల ప్రాణమిదియె
దివ్యశక్తుల చైతన్యతీర్థమిదియె
జీవకోటికి ఆనందశిఖరమంచు
భటుడు భక్తుడు గురుడునై ప్రణుతిసేసె॥ 28

కప్పురజలంబులో జలకంబులాడి
భువన మోహనకల్యాణ మూర్తి వగుచు
శుక్రవాసరముఖముల సొంపునింపు
బాలవీవంచు నశ్రుముత్యాల గొలిచె॥ 29

మన్మనోవాక్కుల కతీతమౌచెలువము
అనుభవానందమే మూర్తియై కనబడె
మూర్తిగాని మరేదో భవ్యమూర్తివీవు
ఆరుదాటిన గాని నిన్నందలేము॥ 30

శక్తియొక్కటియే చరా చరములగుచు
హరిహరాకృతులుగపరమార్థమయ్యె
తరచతరగలనాదమే సరసిజుందు
తత్పరిమళాలె నిమ్నోన్నత మగుసృష్టి॥ 31

సకల సృష్టిసమాహార శక్తి యిదియె
సచ్చిదానంద తత్త్వమై స్థాణువయ్యె
జగదనుస్యూత సత్త్వమై జననమరణ
సంస్థితక్రియల్ నడుపువైష్ణవవిభూతి॥ 32

పాలమున్నీట శయనించు పరశివుడవా!
గిరిశిఖరిపైనటించెడి సిరిమగడవా!
విష్ణుహృదిశివున్ శివహృది విష్ణునెఱుగు
నీచరాచర జ్ఞానియేయెఱుగునిన్ను॥ 33

ఎచ్చటాకర్షణ తరంగ హృదయ మింకు
నచట విష్ణువే స్థాణువై యణగి యుండు
కంబపుటణువు నల్లార్చు కనక దైత్యు
చీల్చినకరనఖోగ్ర నృసింహమీవె॥ 34

నిర్వికారనిరంజన నిస్తరంగ
నిశ్చలాణువే నారాయణీ ప్రభావ
మంద స్థాణువే విష్ణువై యఖిల సృష్టి
పుష్పఫలరుచి శోభితంబుల వెలుంగు॥ 35

ఫాలమందు త్రిశూలపుపట్టెలరయ
హరియెసర్వశక్తుడనసాక్షాత్కరించు
ఫాలమందు సుదర్శనజ్వాల లరయ
హరుడవిద్యాహరుడన ప్రత్యక్షమగును॥ 36

నాగభూషణుడవా! నారాయణీనాధు
డగుదొ! సకల భూషణాంబరప్రి
యుడవా! శ్రీసతీవిభుడవా! షడైశ్వర్య
శక్తివా! తలచినటు ముక్తి వగుదొ 37

దేవదేవా! మహాప్రభో!దివ్యతేజ!
నిన్నునేమని యెంతవర్ణింతునయ్య!
నిర్గుణంబొ! సగుణమొ! రెండింటికంది
యందరాని ఆనందమో అనుభవింప॥ 38

సకలైశ్వర్యాకర్షణ
ప్రకటితయంత్రంబునచట పాదుకొలపి బ
ల్కె కలిన్ వేంకటనాధుడె
సకలారాధ్యుం డటంచు సర్వులు మెచ్చన్॥ 39

ఇది ప్రసన్న విరాడ్రూప మిదిసమస్త
దేవతాశక్తుల అఖండదీప మిదియె
ప్రజకునిత్య కల్యాణము పచ్చతోర
ణమని విడలేక విడతేక నడచె గురుడు॥ 40

వచ్చెమూకాంబికా పుణ్యవాసమునకు
చెట్టుగా పుట్టగా నిటబుట్టసురలె
బరితపింపగ యివ్వనేచరుల బ్రతుకు
ప్రకృతి విపరీతమై రసభంగమయ్యె॥ 41

ఇచటిబరిసరంబులే చిత్రమైయుండె
మధువులేని విరులు మత్తులేని
మధిర,రుచినెరుగని మాంసంబు,గురిలేని
ముద్ర ఫలములేని భోగమొప్పె॥ 42

శిష్యులీ చిత్రమున్ చూడ చెదరిపోవ
శంకరుండొంటిగా ముందు సాగుచుండె
దీర్ఘతరకాయులు చపలోద్రేక చిత్తు
లరుణ రంజిత దేహులా గురునిఁజూచి॥ 43

నిలచికన్నుల కన్నులు కలిపి తెప్ప
వాల్పక మనంబులజ్ఞాతపథము దేల
తల్లిపున్నెంబుబండినతనయుడితడు
ఆత్మనలరించె నెవడో మహాత్ముడంచు॥ 44

బిడ్డ!యెవ్వరివాడ వీవేషమేమి?
ఏమిసాధింపవచ్చితివీగుహలకు?
కటకటా!నేలదాక,రక్తంబుచిందు,
యీమృదుపదంబులిందాక, నీద్వనేల? 45

నిర్జనారణ్యభూముల నిర్భయముగ
తోడుదొనలేక సంచరింతు:నినుజూడ
మామనంబులందేటికో మరులు బుట్టె
రమ్ముతల్లిసేవకని మార్గమ్ము చూప॥ 46

నడచెవారితో మరుమాటలుడిగి గురుడు
పోయిపోయి శక్త్యాలయముకడనిలచె
తలిరుటాకుల కొఱకెడి బలిపశువును
పదునుకత్తుల ఝుళిపించు వారినరసె॥ 47

కనికండ్లు వెడదలై దృఢ
మనమున తా బలిపశువుకు మారు నిలువ యె
త్తినకత్తులెత్తినట్టులా
క్షణమునస్తంభించె గురుని గాంచుచువారున్॥ 48

దిగ్భ్రమంబు జెంది చిరుతదెగువ చూచి
సర్వముతలక్రిందయ్యె ఓజనని! కావు
మంచుచతికిల బడునాఘనాటవికుల
గాంచి దేవతన్ చూచి శంకరుడుబలికె॥ 49

ముగ్గురయ్యలలోగొన్నమూక దైత్యు
నక్షర బ్రహ్మమొనరించు నంబవయ్యు
మూగజీవుల హింసించు ముగ్ధ జగతి
సాధువౌనరింపనీకు నసాధ్యమగునె? 50

శక్తి వికృతిస్వరూపంబు జారిపోయె
శాంతి సౌందర్యశివములే స్పష్టమయ్యె
కొండరాజులు కేల్మోడ్చి గురుని కొల్వ
గంతువైచెబలిపశువుగండముడిగి॥ 51

ఈపిపీలికాదియెల్ల జీవులకు నా
ధారశక్తివీవు తల్లి! నీకృ
పాకటాక్ష మహిమ భస్మమైపోయిన
సృష్టికలకల మని చెలగుమరల॥ 52

ప్రకృతి షట్చక్రపరిణామ భాగ్యవీవు
నీవుదప్పఅన్యంబుకన్పింపదింక
నీకు నీవెవిశ్వాకృతి నెరివిరియుచు
శివసతీ!చిదానందమూర్తి వగుచుందు॥ 53

జపమొ!జల్పమో ముద్రయో భ్రమమొ!మరి మ
హాసనాద్యాహుతి విధులో! ఆహారహంబు
సర్వమాత్మార్పణదృశనేసలుపుపనులు
నీకు చెల్లు నటంచు చింతింతు నమ్మ! 54

ఇంతలో శిష్యులచ్చోటికేగుదెంచి
మీపదంబులీ భూమిపైమోపగానె
ఇది మహాక్షేత్రమయ్యెనీపదమెరుంగ
క్షణములో మారెనని బల్కు నమయమునకె॥ 55

కుహూకుహూనాదముల్ కొమ్మ కొనలపెలగె
పూబొదలబంభరస్వనంబులెగసె మధు
మాంసముల్ లేక శక్తి సంభరితులైరి
ముద్రలేక గురికుదిరె ముదితలేక॥ 56

అవ్వనేచరాళియానందమందగా
క్షేత్రమహిమ నడుగుఛాత్రులగని
గురుడు విప్పి చెప్పె హరిహర బ్రహ్మల
ఆత్మతేజ మిచట యంబయయ్యె॥ 57

కంహుండను మూకవర్ణుని గారబమున
తల్లి పోషింపవాడు మదాంధుడై స
మాధినున్న కోలఋషిని బాధపెట్టె
అంతవర్ణసమామ్నాయమేఅదను దప్పె॥ 58

తల్లిమారియయ్యె తపముకై సుతుడు స
హ్యాద్రికురికె మహిషుడాపదంబు
నాక్రమించె సృష్టి వ్యత్యస్తగా నమరు
లాత్రిమూర్తులక్షరాంబయైరి॥ 59

మాహిషస్తబ్ధశక్తియేమట్టువడ వ
రములగొని మూకుడంబదర్శనముగోర
స్వరము దప్పిన వ్యంజనాక్షరమురీతి
వాడుప్రారబ్ధకర్మచేబలికి చిక్కె॥ 60

మారి తల్లియయ్యె మరలశాక్తేయులు
భక్తులైరిమూకబలులు దప్పె
కోలఋషి తపంబు కొలికెక్క ఓంకార
మఖిల శక్తులకిట యాత్మమయ్యె॥ 61

ఋతము వ్యంజన స్వరసమన్వితముకాగ
పలుకులై కైతలై మంత్రంబులయి ప్రజల
కవుల ఋషుల దీపింపగకంసుతుండు
అక్షరంబయ్యె అంబమూకాంబయయ్యె॥ 62

బ్రహ్మమేశబ్దమై ప్రణవంబుకాగ
అదియె వర్ణసమామ్నాయమయ్యె, మంత్ర
సిద్ధిశీఘ్రంబునన్ కూర్చుక్షేత్రమిదియె
సహజసౌందర్యశివముల స్థాన మిదియె॥ 63

నరులె కాగ సురులు నారాయణీదేవ
తాస్వరూప మఖిలవిశ్వమయ్యె
పర్వతాగ్రపుష్పఫలశోభితారామ
మమృతశక్తుల కొడచాద్రియయ్యె॥ 64

బలిపురాగ్రహార పరిసరంబులకేగ
శంకరునియశమనుచారుడతని
కంటెముందెముందుగాచని గురునికిన్
స్వాగతంబుబలికె జగతిమెచ్చ॥ 65

గురుడునిశ్చలజలధిగా కొట్టవడని
దీపకళికగా నాత్మప్రదీప్తుడగుచు
దోప పూర్ణ కుంభస్వాగతోక్తులనెదు
రగుచునాయగ్రహార విప్రాళివచ్చె॥ 66

వారిలో ప్రభాకరుడను పండితప్ర
వరుడు భట్టపాదుల శిష్యవరుడు కర్మ
కాండమాద్యంతమెరిగిన ఘనుడు యజ్ఞ
ములసురవరుల మెప్పించుపుణ్యధనుడు॥ 67

శోకపరితప్తచిత్తుడైస్రుక్కుచుంట
చూచి,ఆచార్యుడాతని సుతుగతిగని
అయ్య!నీబిడ్డమూకాంధుడంచు కడకు
గురుకృపనుపొందరాడంచుకుములనేల?॥ 68

పదపదమనమేఅతని చూడదగుననగ
అద్భుతానందకంధళితాంతరంగు
డై ప్రభాకరునేత్రంబులాత్మగృహప
ధమునుచూపించెభక్తిశ్రద్ధలుబుకంగ॥ 69

ఇరువురుసేర విశాలాం
తరహర్మ్యమునెల్లవెదుకతండ్రి వెలుపలన్
సరసీవనాంతదృశ్యము
తరచెడిసుతుజూచి ముందు దరియుచునుండన్॥ 70

ఓయీప్రభాకరా! నీ
వాయర్భకునిన్ వశీకృతాత్మునిసెదరం
సేయకుమా అనిశంకరు
డేయటకేతెంచినిలచె డింభకుడంతన్॥ 71

సరసిగర్భాన గురుమూర్తిఛాయచూచి
గ్రక్కునన్లేచిమ్రొక్కె శంకరుడెరింగె
సూర్యచంద్రులవెలిగించుజోతియిదియె
మన్మథునిజయించిన తపోమహిముడితడు॥ 72

అర్భకుండయ్యెనని గురుడాదరమున
ఎవడవయ్య!నీవిటులేల యిచటమసలు
చుంటి?వని గురునికరంబు సుతుశిరంబు
నంట బ్రాహ్మీప్రభల్ అభివ్యక్తమయ్యె॥ 73

నిత్యసత్యమేగాని నిందితుడగాను
సతతచైతన్యమేగానిజడుడగాను
జన్మజలధియే లేని నిశ్చలసుఖి నిక
యెవడనని స్పష్టముగవచియింపగలను॥ 74

మూగనెట్లొదు శ్రుతులెల్లముఖముకాగ
చెవిటినెట్లొదు ప్రణవమేచెవులుగాగ
గ్రుడ్డినెట్లొదు సూర్యచంద్రులెసులోచ
నంబులై చరాచరజగద్వ్యాప్తికాగ॥ 75

బంధువులకుబంధుండనైబందిగాను
పగతులకుపగతుండనై పగనుగాను
ఎవడవెట్టి వాడన్న నేనేమిచెప్ప?
బ్రహ్మవాదికి బ్రహ్మమై ప్రణవమగుదు॥ 76

స్థూలసూక్ష్మకారణశరీరాళి యెవని
యందు సత్యమని ప్రతీతినందె యెవ్వ
డీశరీరత్రయికి యంట కెపుడు కడు; వి
లక్షణుండయ్యె అపర బ్రహ్మమగుదు॥ 77

బాహ్యమద్దంబునందు కన్పట్టురీతి
జగతినాకంటె భిన్నమై సాగదెపుడు
మాయచేసత్తునాయందు మరగె నేన
అద్వయబ్రహ్మ నిఘ్నుండనౌశివుండ॥ 78

స్వప్నమునదోచు జగమెల్ల సత్యముగను
మోహమున విశ్వము మదాత్మ బుట్టుచుండె
స్వాప్నిక జగంబు రీతి విశ్వంబు మిథ్య
శుద్ధబుద్ధ ముక్తాత్ముఁడౌ సూనృతుండ॥ 79

నేను పృధివీ జలానలానిల నభంబు
లేవియును కాను ఇంద్రియావృతుడకాను
సుప్తిసాక్షి చిదానంద శోభితుండ
కేవల శివస్వరూపుండనై వరలెద॥ 80

అమ్మహావాక్య తత్వార్థ మందదంగు
భావమూహించి దిగ్భ్రమస్వాంతులైరి
పరిజనంబు, బ్రహ్మానందపరత గురుడు
ఈతడు జగద్గురుండౌట బుత మటంచు 81

కరతలామలకంబునన్ కంటబడెడి
ధారలవిధాన నిఖిల వేదాంతసార
మితని సరళవాక్యంబు లందిమిడెగాన
ఇతడు హస్తామలకు డన యిల వెలుంగు॥ 82

బాలునెరుగ వైరాగ్య సంపన్నుడింటి
పనుల కేమాత్ర మీతడు పనికి రాడు
ఇతడు మాచెంత నుండుటే హితము మాకు
మీకు లోకాలకంచు ప్రభాకరుదిశ 83

చూడ; ఆచార్య శంకరున్ చూచె గేస్తు
ఖేదమోద మిశ్రాత్ముడై కృశత చిక్కు
ధర్మపత్ని చిత్తము బాష్ప ధారలగనె
సుతుని గతినెంచి గురుదేవుసూక్తి తరచె 84

శిష్య సంరక్షణార్థమై శిష్ట గురుడు
శంకరుడు వచ్చెనని గురుచరణములకు
ఆత్మజుని ధారవోసె గృహస్థు సుకృతి
యె సుకృతియని ప్రభాకరున్ వసుధపొగడె 85

కదలె గురుడు హస్తామలకప్రముఖ స
హచర బృందంబు నహంక్రియాభిమాని
నీలకంఠాఖ్యుడాచార నిరతుడెదుట
బడియె శైవ శాస్త్రాగమద్వైతి యొకడు॥ 86

నొసట తెప్పల చెవితుదిన్ బసుమమలది
కంఠమందు రుద్రాక్షలు గలగలమన
కుంకశంకర గర్వంబు కూల్తునంచు
వాదుకై కాలుదువ్వుచు పైబడంగ॥ 87

ప్రతిఘటింప వచ్చిన సురేశ్వరుని చూచి
శాస్త్ర పాండిత్య మనుభవ జ్ఞానమందు
పూర్ణమౌ గాకనుకరణ పూరితుడగు
శిష్య సన్యాసితో వాదు సేయననగ॥ 88

బ్రహ్మ జీవ జగముల బరస్పరప్ర
భేద మైదువిధంబుల విస్తరించె
భక్తిరేవగరీయసీ బలుకు నిలుపు
ద్వైతి యీతడే యానంద తపసియంచు 89

శాంత నిశ్చల గంభీర శమదమాది
సద్గుణానందమూర్తి యై శంకరుడట
దరహసితవదనాబ్జుడై దరియుచు మృదు
లార్ద్ర దృక్కుల తాశివోహంబనంగ॥ 90

సాంధ్యరాగము పదసరోజముల చెదర
వెలుగు వెన్నెల శిరముపై తళుకుమనగ
ప్రణవ పరిపక్వమౌ మృదుస్వరము లొలుక
తరగలడగు కడలిగ నద్వైతి నిలువ 91

నీలకంఠుడాచిన్నవాని కనుపాప
కనులజేర్పగ ఆత్మ యజ్ఞాత సీమ
ల బడె తనువు దాసోహమై ప్రణుతిసేయ
మనసు నిగమాగమంబులు మాయమయ్యె ॥ 92

ముందుకేగ శివుడు మురహర భక్తుండు
వైష్ణవాగమ ప్రభావితుండు
వాసుదేవ వైభవమును దీపింప అ
ద్వైత గురుని గెలువ వాదియయ్యె॥ 93

నారయణుడే సర్వము
నారాయణుడే చిదాత్మ నారాయణుడే
కారుణ్యాంబుధి లక్ష్మీ
నారాయణుడే పరంబు నరజాతికిలన్॥ 94

బ్రహ్మమే విష్ణువు జగములాతనువుగ
విడివడని మహాలక్ష్మి జీవియహరహము
శేముషీశేష భక్తుడాశ్రితుడిదే వి
శిష్టమపృధక్వైభవమయ్యె సేకొనదగు 95

శంఖచక్రధారి, సరిసిజాక్షుండు, కే
యూరమకరకుండలోజ్వలుండు,
పీత వస్త్రధరుడు, విష్ణువు నారాయ
ణుం డసదృశ గుణగణోన్నతుండు 96

వేడిలేని వహ్ని వెల్లదనములేని
క్షీరమలలులేని నీరధి జగ
మందసంభవ మగునయ్య! బ్రహ్మము సవి
శేషమై సదా ప్రసిద్ధమగును 97

సకల కల్యాణ గుణగణ సార్వభౌము
డమృతమూర్తి లక్ష్మీ ప్రియుండా శ్రిత జన
వత్సలున్ జగన్మోహను వదలనగునె?
కొలువ బ్రహ్మపద మన శంకరుడునవ్వె॥ 98

సాధనా స్థితిన్ మీ బల్కు సాధువయ్యె
కాని శేష శేషీ న్యాయగతి మధింప
భేదమే సిద్ధమగుచుండె బేదమందు
జీవి సాయుజ్య ముక్తిని చెందలేడు 99

మాధవుడు బ్రహ్మ మనెడి మీమాటలెల్ల
సత్యమే వ్యావహారిక జగమునందు
పారమార్థిక స్థితిజూడ బ్రహ్మ మొకటె
అదియెనిర్గుణ నిర్విశేషానుభవము॥ 100

వెలుగు నుండి శీతోష్ణముల్ కలుగవచ్చు
కాని శీతోష్ణముల్ వెల్గుకాదు; తరచ
గుణ విశిష్ట మీభేదాన కుదురుకొనియె
అసలు తత్త్వానికీ తోకలతకవయ్యె॥ 101

అల జలమగుకాని జలధికానేరదు
వన్నె తెలుపు కాని వస్తువగునె
బ్రహ్మ మందు మాయ భాసించు మాయక
త్యంబుకలదు బ్రహ్మ మణగ దెపుడు॥ 102

సగుణ నిర్గుణాలు చంచలాచంచలాల్
సకల వేళలందు సన్నిహితుడు
శతసహస్ర నామ సార్థక తత్త్వమై
విస్తరించు బుతమె విష్ణువయ్యె॥ 103

పరమ పథమొకటియె వైష్ణవం బదియె స
ర్వత్ర నుండు గాన వాసుదేవు
డదియె జీవి జీవమగుచు నారాయణ
ప్రాభవ మగు నదియె బ్రహ్మమయ్యె ॥ 104

రూప గుణములకతీత
వ్యాపకమై యఖిలములకు నాధారంబై
అపర తత్వం బొకడని
రూపింపగ గాదొకటని రూఢంబయ్యెన్ 105

నామ రూప గుణంబులు నాశమగును
బ్రహ్మమునకీ పదచ్యుతి పట్టదయ్య
దేశకాలయుపాధుల త్రెళ్ళనట్టి
సచ్చిదానందమొక్కటే శాశ్వతంబు 106

బ్రహ్మమే సచ్చిదానంద భాసురంబు
కల్పితంబగుమాయ జగంబులెల్ల
జీవుడా బ్రాహ్మమే జ్ఞాన శిఖల వెలుగ
అద్వయానందమొకటియే అనుభవమగు 107

ప్రథిత విష్ణు నారాయణ వాసుదేవ
ఆఖ్యలివి బ్రహ్మ శబ్దవాచ్యంబులయ్యె
సచ్చిదానంద తత్త్వమే స్వచ్ఛమనగ
శంకరుడు హరి ప్రియుడని చనిరివారు 108

అంత నటనుండి శృంగేరి ప్రాంతమునకు
తరలి తుంగా నదీ సైకతస్థలముల
నడువ వాణి నూపుర నాదమడగె గురుడు
వెనుదిరిగి చూచె శారదా విగ్రహమును॥ 109

ఓ మదీయకర్తవ్య మిందుడిగెనంచు
బరిసరంబుల చూడ పూర్వాభిముఖము
గా నురుకుతుంగయే యిట కంటిచూపు
మేరమెరసి యీశానులో జేరుచుండె॥ 110

ఇది పరమ పవిత్రంబైన పదము తుంగ
జీవనది శృంగగిరి రెండు చేరె ప్రకృతి
సహజ సౌందర్య మీశుని స్థాణుమహిమ
కలుపు ధర్మావనియని శంకరుడు నిలచె॥ 111

స్నాన సంధ్యాది వేళల సహకరించు
భిక్ష సేకొను సమయాన ప్రీతి కొలచు
కంటి ఱెప్పగ తోనీడగా భజించు
గురుని ఆనందుడానందగిరిగగాచె॥ 112

ఒక్కనాడు శిష్యులుత్కటోత్సాహులై
ప్రవచనంబు నడుప త్వరితబరుప
గురుని; గిరియు వచ్చు వరకాగుడన వారు
గిరికి చదువెయని నగిరి పలుచగ॥ 113

గురుని గుండె చివుక్కనె కరుణకనుల
దిరిగె మృదులార్ద్రహృదయంబు విరియగ నట
కావులుతికెడి కాయిక కర్మయోగి
గిరిమతి వినూత్నపు ఱెఱుక పొరల పొరలె॥ 114

పట్టరాని ఆవేశంబు పైకి తెలుప
రాని యనుభవంబు నరనరంబులమృత
వాహినులయి సహస్రభావములు పొంగ
కాయికమె జ్ఞాన శిఖలతో కైతయయ్యె॥ 115

గురునిసేవా సుఖంబుక్కి గుండె గొంతు
చీల్చుకొని వచ్చు ఛందమే శిశువుకాగ
అపర వాల్మీకియై ఆతడరుగుదెంచి
శంకరభగవత్పాదుల సన్నిధినిడె॥ 116

భావపూరిత వృత్తమున్ పాడ గిరి; స
హచర బృందంబు తత్వార్థ మరసి తలలు
వంచిరి, గురుడు జాలితో వారినరసె
హరుడు కరుణింప సిద్ధి నూరారుగతులు 117

కాయిక మనుభవానందకవిత యగుచు
అన్న! తోటకావృత్తంబులయ్యె నిపుడు
తోటకాచార్యుడైనీవు నేటినుండి
గణుతి కాంతువని గురుండు కనికరించె॥ 118

కాయికమె భక్తి భక్తియే జ్ఞానమగును
స్థాయి భేదమే గాని రస పరమార్థ
మన్నిటికి నొక్కటే చిదాహ్లాదియయ్యె
మార్గములు వేరెకాని గమ్యంబు నొకటె॥ 119

తర్కమునతిక్రమించు నార్ద్రమతి శమద
మాదిషడ్గుణ సంపత్తి యాత్మ శక్తి
అనుభవానంద జీవితం బమరు గురుని
సన్నిధానమే భారతీ సన్నిధియగు 120

శిష్యహస్తామలకుడు వచించి నట్టి
ద్వాదశశ్లోకముల తత్త్వ పరవశుడయి
గురుడె శిష్యుడై వ్యాఖ్యానగరిమ మెరసె
శంకరుండే రసాద్వైత చక్రవర్తి 121

ఈ జగతి తరింప స్నిగ్ధ హృదయుడై ప్ర
పంచసారతంత్రము చెప్పె శంకరుండు
దానిని సనందు డధికశ్రద్ధ వివరించె
మంత్ర తంత్ర వేత్తల మనం బబ్బురపడ॥ 122

పద్మపాదుడు శంకర భాష్యమునకు
వార్ధికము సేయ గురుడందు పంచపాద
ములు చదివి యిందు నాలుగే వెలుగుచూచు
నని సురేశ్వర శిష్యాళికానతిచ్చె 123

శ్రీగురుడు మెచ్చ నైష్కర్మ్య సిద్ధి యనెడి
తాత్విక గ్రంధమున్ వ్రాసి తైత్తరీయ
ఉపనిషద్కాణ్వ శాఖల కుత్తమగతి
వ్యాఖ్య నొనరించె నా సురేశ్వరగురుండు 124

శిష్య సేవలంది శృంగేరిలో జగ
ద్గురుడు యోగ నిరతి వరలు చుండ
ఒక్కనాడు హృదయ మున్నట్లు దేవి న
ట్లయ్యె మరణశయ్య నంబ దలచ 125

వెంటనే యోగశక్తి వినీవీథికెగసి
తల్లియెదుట శంకరుడు ప్రత్యక్షమయ్యె
పడక నంటుశల్యపు గూటి పక్షి జనని
కనులు దెరచి "శంకీ" యనె గళమువడక॥ 126

అమ్మాయని పొంగెడి దుః
ఖమ్మును నిల్పుకొనలేక గదిసెడి సుతు శో
కమ్ము గని చుట్టములు చి
త్రమ్మౌ యతి వృత్తమనుచు తహతహ లాడన్ 127

తలచినంతనే గురుడు హస్తమున తులసి
గాంగ జలము వచ్చె జనని గళము దడుప
త్రాణవచ్చె ఆర్యాంబ నేత్రములు తళత
ళమన యతిరాజు తల్లి పాదముల ముట్టె 128

బాష్పకణములు పలపల పైబడ సుతు
డంబ నొడిజేర్చుచు దృఢాత్ముడై వచించె
అమ్మ! నీ కోర్కె యేదియో ఆనతిమ్మ
ఎట్టి దైనను దీర్చెద నీక్షణమున॥ 129

ఇంకను కోరికలున్నవె
శంకర! చాలయ్య చాలు జన్మంబులు ని
శ్శంకిత మోక్షపదంబును
సంకల్పించితి హరి ప్రసాద మెటులొ నాన్ 130

నారాయణ నారాయణ
నారాయణయని గురుండు నామ త్రికమున్
పారాయణ మొనరింపగ
నారీమణితులసి కొంచు నారాయనగాన్ 131

నింగి నీలాల కాంతులు నిండు కొనగ
చల్లని పాడిగాడ్పు లెదపై చేమురుచుండ
శంఖ చక్రగదాధారి సారసాక్షు
డంబయెదుట ప్రసన్నాత్ముడై నిలువగ॥ 132

గుండె దడదడమని బిట్టుకొట్టుకొనగ
శ్యామసుందరున్ తెప్పలల్లార్పకుండ
చూచుచుండెనోయన తల్లి చూపునిలచె
అంబజగదంబగాన్ ఆత్మయాత్మచేరె॥ 133

తిరిగిరాని పదంబందె స్మరణమాత్ర
తల్లివాంఛితార్థము తీర్చుతనయుడగుచు
సకలభూత హితార్థియై సన్యసనము
గాంచు శంకరుడొకడే జగద్గురుడిల॥ 134

శివుడు లేని గుడికి పూజసేయుటెటులొ!
తల్లిలేని యిల్లు భయప్రదమని గురుడు
చూడకాదృశ్యమున్ చూచె సుతుడెకాగ
ఇంక సామాన్యుల గతి యూహింపనగునె?॥ 135

ఆత్మవిడిపోవ కరణేంద్రియాది సకల
ప్రాణబుధ్యహంకారముల్ పట్టుదప్పె
స్నేహముడుగ దీపము వత్తినే దహించు
వికృత తనువుకు సంస్కార విధివిధియని 136

కనిపెంచి పెద్ద జేయగ
ఘనతరసన్యాస దీక్ష గైకొన కరుణిం
చిన తల్లి వరాల గుడియె
ప్రణుతత్యాగైక గృహమె పాడువడె నిటన్ 137

తల్లికిచ్చిన మాటయాత్మ ధ్వనింప
దహన సంస్కారవిధికి యుద్యత్తుడైన
గురుని జూచి చుట్టంబులు కొఱకొఱవడ
ఛాందస ద్విజ వర్గంబు సరకుకొనక 138

కర్మకాండకు మీకధికారమెవ్వ
రిచ్చిరి? యెపుడో! బంధముల్ ద్రెంచుకొనిన
యతికి గురున కీమమకార మంటదగునె?
కంచెయే చేనుమేసిన కాపుమనునె? 139

చుట్టముల విప్రవర్గమున్ చూచి పరమ
శాంత సౌజన్యమూర్తి సర్వజ్ఞ గురుడు
అయ్య! మీనుడి స్మృతిహితంబయ్యె కాని
సూక్ష్మదృష్టితో సత్యమున్ చూడవలెను 140

దేశకాలానుగుణముగా స్థిరమొనర్ప
వచ్చె నాచారముల్ పరంపరనుబట్టి
వాటికనువుగ స్మృతి విధుల్ ప్రబలెకాని
శ్రుతిని మఱచి శాస్త్ర స్మృతిన్ చూడరాదు॥ 141

మాతృదేవోభవా! యనుమాట శ్రుతిది
ఆశ్రుతియె చాటుచుండె 'సత్యంవద' యని
త్యాగమయి తల్లికిడుమాట దాటదగునె?
సర్వభూత హితార్థియౌ సద్గురునకు॥ 142

యతినిగాక మునుపె యంబకిచ్చిన మాట
నిలుప కర్మసేయ నిలచినాడ
స్మృతి విరుద్ధమయ్యు శ్రుతి కనుగుణముగా
ధర్మమాచరింపదగునరుండు 143

స్వార్థసంకుచిత క్రియల్ దాటుయతికి
ధర్మమనురాగ రహితమైతప్పు కొనదు
ధర్మముదయార్ద్రవిహీనమై తగులబడదు
ధర్మము బ్రహ్మ మఖిల భూతహితకరము 144

స్వార్థబుద్ధి కర్మబద్ధుడగాను స
త్యస్వరూప మిదియె తత్వమనగ
కర్మతులయివారు కాదన విప్రుల
విడిచి కర్మనిరతి పెరటికేగ 145

వ్రేళ్ళతో నెండు వృక్షంబు విరిగి పడగ
తల్లి శవముతో యోగాగ్ని దగ్ధకర్మ
డగుచు నిశ్చింత నాచార్యుడాత్మ ధర్మ
రక్షణో సెయ పథము తలంచు చుండ 146

గాలి గంటలు మ్రోగ శంకరుడు నాల
యధ్వజస్తంభమున్ చూచి యచటికేగి
మందిరమున గీతాచార్యు మహిమలెల్ల
రూపుగట్టగ స్మరియించి మ్రొక్కెహరిని 147

పరవశత వెలువడు జగద్గురుని చూచి
అదిగదిగొ మన దేవుడీ యయ్యయంచు
ప్రజలు తండోపతండంబులై పడంగ
వారిని కృపా కటాక్షానబట్టి నిలిపె॥ 148

మందలంగాచె బాలుడై సుందరులను
గూడెరసికుడై అని విశ్వగురుడె కాగ
మురళియో మునికోలయో। ముందుకాను
దర్శనమొ! అన్నియును పూర్ణతత్వమయ్యె 149

ఈ జగద్విభు విభవమే హితము మహికి
తలచి తరచి తరింపుడో ధన్యులార॥
అంచు దీవించి వారల యచట నుండి
కంచికేతెంచి శిష్యుల గాంచెగురుడు॥ 150

ఇంతలో బౌద్ధపండితు లేగుదెంచి
శూన్యవాద ప్రభావంబు చూప గురుని
నిశిత తర్క శక్తుల ముందు నిలువకదియు
పూర్ణమై బుద్ధుడవతార పురుషుడయ్యె॥ 151

బుద్ధ భగవాను డొకమాతృమూర్తి యతని
హృదయమెంత పేశలమొ వర్ణింపగాదు
ప్రాణుల బరితాపమడంప రాజ్యమాలు
బిడ్డల విడిచి ఆనంద భిక్షువయ్యె॥ 152

ఆ తథాగతుని మహాశయంబు ఫలింప
వ్యక్తి యీశుడగుచు ముక్తి పొంద
ఆత్మశక్తి వలయు నప్పుడష్టాంగమా
ర్గము పునాదులున్న కట్టడమగు॥ 153

బ్రహ్మచైతన్యమునకు వివర్త మగుచు
జీవజగములే యెదుట భాసింపుచుండ
సర్వశూన్య మీజగమెల్ల క్షణికమంచు
శుష్క వాదంబు సేయుట సూక్తమగునె? 154

క్షణికమనుట జగతి సత్యమే మఱి యది
స్థానమందకదియు కానరాదు
శుక్తి వెండియగుచు చూపట్టునటుల మి
థ్యా జగంబు బ్రహ్మ మందెమెరయు॥ 155

నాగయితని తర్క నైపుణ్య మీజగ
న్మిథ్య వాదమే అమేయ మితడు
మామతంబె చాటె మఱి మఱి, ప్రచ్ఛన్న
బౌద్ధుడిపుడు బ్రహ్మవాదియయ్యె 156

బ్రహ్మ సత్యమనెడి బ్రాహ్మ్యంబు గెలువ న
సాధ్యమని క్షపణులు జారుకొనగ
ఛాత్ర వర్గమెల్ల సంభ్రమోపేతమై
శంకర గురుపాద సరఘమయ్యె 157

ఉగ్రరూపంబు బోనాడియుల్లముల్ల
సిల్ల తారయే మంత్రాభిషిక్తయగుచు
విప్రులర్చింప నుపనిషద్వీధి వెలుగ
కంచి బంగారు కామాక్షి కాగ మ్రొక్కె॥ 158

ఆత్మ శక్తికి నిలయమై ఆస్తికులకు
జీవకర్త్రయై వివిధ విద్యా విభూతి
కంచియే జగత్కళ్యాణ కారియయ్యె
సర్వమతముల సామరస్యంబు కుదిరె॥ 159

శివుడు నేకామ్రనాథుడై వివిధ రుచుల
ఫలములందీయ వరదుడై నిలువహరి కొ
మరుడు దేవసేనానియై సురల నడప
తమము తెగటార్చి లోకబాంధవుడు వెలిగె॥ 160

సకల మఠముల మతముల శక్తి కేంద్ర
మై సనాతన ధర్మ సంస్థాపనార్థ
మహరహము శ్రమించెడి మహా మంత్రపీఠ
మీ పురవరంబె కల్యాణ గోపురంబు॥ 161

కంచి ప్రాగ్వైభవంబుద్ధరించి అడుగ
డుగున అద్వైత తత్త్వంబు నెగడుగాక
దక్షిణంబున ముక్తి పదమ్మిదియని
బదరికావనమునకేగె పరమగురుడు॥ 162

ముజ్జలధు లాకసంబును ముద్దు వెట్ట
పైబడ హిమాద్రియై నిల్చె బరవసించి
ముగ్గురయ్యలు దత్తుడై ముందు నిలువ
శిష్య గురులను జూచుచు శివగురుండు ॥ 163

తలపునన్ మహా వాక్య రత్నావళి మఱి
శుకరహస్య శ్రుతియు చాటు సూక్తు లెరిగి
అసదృశ జ్ఞానమే బ్రహ్మ మహాముబ్రహ్మ
మాత్మయే బ్రహ్మ మగు తత్త్వమసి తెలియగ 164

నాల్గువేదాల సూక్తుల న్యాయ మెఱుగ
సచ్చిదానంద మొకటినే స్పష్టపరచె
బ్రహ్మ జీవజగముల బరస్పర ప్ర
భేదమడగునని గురుండు విప్పిచెప్పె॥ 165

ఈ యుపనిషన్మహా వాక్కులే జగాన
నాల్గు దిక్కుల నాలుగామ్నాయ పీఠ
ముల సరస్వతీ కళలతో బులకరించు
భరత ఖండమఖండమై ప్రబలునటుల॥ 166

భిన్నభావాలదవిలి నిర్వీర్యమై ని
రస్తతేజమై నరజాతి గ్రుగ్గుచుండె
భిన్నమందున్న నేకాత్మ విశ్వమయుని
కాంచు కర్మయోగియె యిల జ్ఞానియగును 167

అహము బ్రహ్మము తన్నుదానరయుగానె
ఆత్మ బ్రహ్మము చైతన్యమందజడత
జ్ఞానమే బ్రహ్మ మానందమానసమున
తత్త్వమసి తత్త్వమెఱుగ భేదంబడంగు॥ 168

ఉత్తరంబునగల జ్యోతిర్మఠంబిది
బదరికాపవిత్ర పదము నిండె
అలకనంద తీర్థమై "అయమాత్మ బ్ర
హ్మా" మనెడి నిగమోక్తి యవనిచాటు॥ 169

పూర్ణగిరి శక్తిపీఠమై భువిని నిలుప
తోటకుండిట యాచార్య ధూర్జటియగు
భోజ పాంచాల కాశ్మీర భూముల కురు
బదరికాక్షేత్రముల ధర్మ పాలకుడగు॥ 170

ప్రాగ్దిశగల జగన్నాథ పట్టణమున
విమలశక్తి గోవర్ధన పీఠమలరు
ప్రాజ్ఞ్మహెూదధి తీర్థమై ప్రబలుచుండ
జ్ఞానమే బ్రహ్మమై జగచ్ఛక్తియగును 171

అంగవంగ కళింగోత్కలాది సీమ
లేలు పద్మపాదుడు ధర్మలోలుడగుచు
సర్వసమదృష్టి రక్షించు జనతనెపుడు
ఆ జగన్నాథు నాశ్రయంబండకాగ॥ 172

పశ్చిమంబున ద్వారకా పట్టణమున
భద్రకాళి పీఠాధిదేవతగ నిలువ
గోమతీతీర్థమంది హస్తాములకుడు
"తత్త్వమసి" వాక్య తత్త్వార్థ ధామమగును 173

సింధు సౌవీర సౌరాష్ట్ర సీమలాప్ర
సిద్ధమౌ మహా రాష్ట్రంబులుద్ధరించు
సామవేదాధ్యయనబుత శక్తి నెఱిగి
చాటుగాక ధర్మా ద్వైత సారమిందు 174

దక్షణావని తుంగ నిత్య ప్రవంతి
తీర్థమై శృంగగిరి భారతీ ప్రధాన
పీఠమై సురేశ్వర గురు వీరుడేలు
ద్రావిడాంధ్ర కర్ణాట కేరళ పదాల॥ 175

తపముచే "నహం బ్రహ్మ" తత్త్వమిత డెఱిగి
శృంగగిరిరీతి ఋషియౌచు తుంగ ప్రకృతి
సమరసంబున శారదాచంద్రమౌళు
లప్రభ చరాచర జగత్పాలన మొనర్చు 176

వర్ణ వర్గ ప్రభేదాల పరిమళించు
ద్వైతమను సుందరోద్యాన వనములందు
అద్వయానంద మకరందమన్నిట గొను
భ్రమరమే భక్తుడై ముక్తి పదముగాంచు 177

శుచి జితేంద్రియుండు శ్రుతి సూక్త వేదాంగ
విదుడు సకల శాస్త్రవేత్త యోగి
పరమహంస పూర్ణ పురుషుడే గురుపీఠ
మధివశింప నర్హుడౌ జగాన॥ 178

ప్రణవ మంతర్ముఖుండై జపము సలుపుచు
లౌకిక క్రియలందు నారాయణస్మ
రణయె జీవుల జీవన మనితలంచు
యతియె నిర్గుణ సగుణాల సాక్షియగును॥ 179

స్వార్థ రహిత కర్మ చైతన్య శక్తియై
స్థాభ్యమడచు చిత్త శాంతి గూర్చు
సత్య సుందరమగు జ్ఞానమే తానౌచు
జన్మతారకుడగు జనులకెల్ల॥ 180

ఆత్మకార్య స్వరూపమై వ్యక్తమైన
పరపదమె చిద్విశిష్టమౌ; వైష్ణవంబు
ఆ పయోధి నారాయణ రూపమయ్యె
జీవకణలోక మావాసు దేవమహిమ 181

సత్యమయ్యె బ్రహ్మ, చైతన్యమే విష్ణు
వా, ప్రమోదమే మృడాత్మ, తెలియ
సృష్టి సంస్థితలయలీ జీవజగముచే
గుణగణాత్మక మని ఘనుడెరుంగు॥ 182

అవని జలమున జలమనలంబున అనల
మనిలగతమౌచు ననిలమంబరమున
అంబరమ్ము మాయయందదియును శుద్ధ
బ్రహ్మ మందు సేరి బ్రహ్మ మగును॥ 183

నామరూపాలు శతకోటి నాకుగాని
నేను నేదియు గాని నిర్ఛిద్ర శక్తి
కోమలసుగంధమాధురీ గుణములగుదు
కాని నాయందు గుణములే కానరావు 184

చేతనాచేత నాత్మక జీవ జగము
లన్నియునునేన నేనుగాకున్న ధన్య
మేదియును లేదను పలుకులే ధ్వనింప
దరుల శిఖిలేని వెలుగయ్యె గురువరుండు 185

శిష్యులా హిమప్రభ జూచి చింతలుడగి
ముప్పులేదయ్యె గండమున్ దప్పెనెపుడొ
మిత్తిముట్టి వెఱచె మేను మెరసె యోగ
బలమున గురుండె అన్నిటన్ బ్రహ్మమయ్యె॥ 186

# శీర్షికా పద్యములు

స్త్రీ పురుష విభాగమె లేక సృష్టి లేదు
సృష్టియే లేక చేతనాచేతన ప్ర
పంచమే లేదు ద్వైతమే ప్రబలకున్న
ఉనికియే లేదు పరమాత్మ నూహసేయ

జీవజీవుల భేదంబు సృష్టి స్రష్ట
లగల తారతమ్యము గుణత్రయ విభాగ
మంది వన్నె వన్నెల రహస్యార్థమెఱుగు
దివ్య నేత్ర మందిన వాడె ద్విజవరుడగు॥

మమతోత్తాలపు సంసా
రమగాధ పయోధి అహమరయ మకరీబం
ధము త్రెంచు జీవి భద్రే
భము దీనికి భక్తి యొకటె పరమార్థమగున్

ఒక్కడార్జనాసక్తి యూరూర తిరుగు
ఇంకొకడు జంటకై జగంబెల్లచుట్టు
వేరొకడు స్వ ప్రతిష్ఠకై ఆరడిపడు
కాని గురునికై బోవు జిజ్ఞాసి యెవడొ!

అణువు నందు బ్రహ్మాండమే అడగినటుల
విత్తులో బృహద్వృక్షమే విరిసి నటుల
అక్షరంబున రసజగంబమరినటుల
గురునిలో బర బ్రహ్మమే కూడియుండె

దేహమే లేక సేవించు తెరువులేదు
హృదయమే లేక ప్రేమించుటెరుగబోము
ఆత్మయే లేక అనుభవంబందలేము
చెడు తనుమనంబులు పరాత్మ చేటు వడదు.

ఎటనో మోక్షంబని న
మ్ముటకంటెను బ్రతికినపుడె ముక్తి శ్రీ సం
ఘటితానందంబిచ్చెడి
ఘటశాసియె భ్రమరమయ్యె జ్ఞానాటవిలోన్

ఒకటి రెండయ్యె నారెండె యొకటికాగ
మూడు నైదు నేడున్ సముద్భూతమగుచు
తొమ్మిదిగదొచి తుదకు పూర్ణమ్ము కాగ
పూర్ణమున బుట్టి పూర్ణమే పూర్ణమయ్యె

పక్షులే వేదపంక్తులు పల్లె వేయ
స్వర్గభోగాది భాగ్యముల్ ప్రజలుపొంద
కర్మమీమాంస బండిన ధర్మభూమి
సత్యమో మిథ్యయో చూపు శాఖ యిదియె! ॥

జనులు జిజ్ఞాసులై సభాసదులుకాగ
స్త్రీలు బ్రహ్మ విద్యల తుది తీర్పునీయ
జీవుడే జ్ఞాన శిఖలచే శివుడు కాగ
భరత సంస్కృతి సారమే బ్రహ్మమయ్యె.

చంచలాచంచలమె జగచ్ఛక్తియయ్యె
పూబరములంబులే మధుపూర్ణమయ్యె
మధుర గాంభీర్య గుణములే మర్మమయ్యె
ప్రకృతి పురుషులే సమరసాద్వైతమయ్యె

నలుమొగంబుల వెలువడునాదమప్ర
తిహతమైనాల్గు దిశల బ్రతిష్ఠ కాగ
నాల్గు వేదవాక్యంబులన్ నలువరాణి
ఉపనిషద్బ్రహ్మ మైభరతోర్వి నిలిపె॥

# తప్పు-ఒప్పుల పట్టిక

| పుట | - | పద్యం | - | పాదము | తప్పు | - | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 17 | - | 1 | - | 1 | పెట్టు | - | పెట్ట |
| 19 | - | 2 | - | 4 | వెతడంచు | - | వెతలడంచు |
| 19 | - | 5 | - | 2 | పెరిగు | - | పెరుగు |
| 21 | - | 3 | - | 4 | చరింప | - | చరించె |
| 23 | - | 2 | - | 3 | ప్రాణాల | - | ప్రాణుల |
| 25 | - | 3 | - | 1 | గణంబు | - | కణంబు |
| 27 | - | 1 | - | 1 | సభ్రమ | - | సంభ్రమ |
| 28 | - | 3 | - | 2 | మందుకొనగ | - | మందననగ |
| 28 | - | 6 | - | 1 | నాకు | - | నాక్షు |
| 31 | - | 3 | - | 4 | జాల్కాప | - | జాల్కాన |
| 32 | - | 2 | - | 2 | జరటు | - | జరతు |



**బాడాల రామయ్య**

ఆంధ్రరాష్ట్రం చిత్తూరు జిల్లా మదనపల్లె జన్మస్థలం.

తల్లిదండ్రులు నంజమాంబా, నాగేశ్వరులు.

**విద్యాభ్యాసం:** మదనపల్లి దివ్యజ్ఞానోన్నత పాఠశాలలో ప్రాథమికోన్నత విద్య. మదరాసు పచ్చయప్ప కళాశాలలో ఎం.ఏ. (తెలుగు). మైసూరు విశ్వవిద్యాలయంలో డి.లిట్.

**ఉద్యోగం:** మైసూరు విశ్వవిద్యాలయమున 1954 నుండి 1972 వరకు ఆంధ్రోపన్యాసకులు. 1972 నుండి 1982 వరకు రీడరు, తెలుగుశాఖ అధ్యక్షులు. బెంగళూరు విశ్వవిద్యాలయమున 1982 నుండి 1990 వరకు తెలుగు ప్రాచార్యునిగా నుండిరి. విజిటింగ్ ప్రొఫసర్ (దార్శనికాచార్యుడు)గా కర్నూలు స్నాతకోత్తర విద్యాకేంద్రమున పనిచేసిరి.

**రచనలు:** కృష్ణకథావిపంచి, లేపాక్షి స్వప్నదర్శనం, ఆనందవల్లి, సుత్తూరు గురుపరంపర, బసవేశ్వర వచనాలు-సమగ్ర సమీక్ష, కడుపుకోత (గేయకవిత), సౌందర్యలహరి (తెలుగు), పంపానన్నయ్యుర ప్రతిభా తపస్సు (విమర్శ-కన్నడం), వీరేశలింగం (కన్నడం) మున్నగునవి.

**ప్రశస్తులు:** గుడియారం శేషశాస్త్ర ప్రశస్తి, ఆంధ్ర గవర్నమెంటు కవి సన్మానం, పుట్టపర్తి సత్యసాయి బాబా సన్మానం, శృంగేరి సంస్థాన సన్మానం, సిరిగెరె తరళబాళు మఠ సన్మానం, సుత్తూరు శివరాత్రీశ్వర మఠ సన్మానం.

**విలాసం:** బాడాల రామయ్య, డోర్ నెం. 10,11వ క్రాస్, జయనగర్, మైసూరు-14.